# అంతర్జాతీయధర్మశాస్త్రము

## (International Law)



...ంథకర్త

...ర్యనారాయణరావు

B.A., B.L., & L.T.,

Advocate.



సర్వస్వామ్యసంకలితము ]          [ వెల రు 0–10–0

# అంతర్జాతీయధర్మశాస్త్రము

## (International Law)




..............................................

గ్రంథకర్త

వల్లూరి సూర్యనారాయణరావు

B.A., B.L., & L.T.,

Advocate.



1931

 [ వెల రు 0-10-0

# ఉపోద్ఘాతము.



ఆ 1914 సంవత్సరములో, యూరపుఖండవాసులమధ్య మహా ఘోరసంగ్రామము జరుగుచున్నపుడు, యీ అంతర్జాతీయధర్మశాస్త్రములోని ముఖ్యసూత్రములను కృష్ణాపత్రికలో ప్రతివారము ప్రకటించుచుంటిని. వానినే కొద్ది మార్పులతో, యీ చిన్నగ్రంథముగ వ్రాసితిని. గత 15 సంవత్సరములలోను, భౌతికశాస్త్ర పరిశోధన లనేకములు వెలువడి, యుద్ధరంగము, ఆకాశములోనికి మార్చబడినది. ఇప్పుడు కాల్బలముయొక్కయు, ఫిరంగులయొక్కయు, యుద్ధనావలయొక్కయు సంఖ్యనుబట్టి జయాపజయములు నిర్ణయింపఁబడజాలవు. సముద్రపు అడుగుభాగమును, ఆకాశమును యుద్ధరంగములై యుద్ధతులు ముఖాముఖిని పోట్లాడుకొనునవసరము లేకనే ఒక్క త్రుటికాలములో లక్షలకొలది జనము, వేలకొలది చదరపుమైళ్ళ భూభాగము భస్మీపటలము చేసి శ్మశానవాటికకంటెను అధ్వాన్నము చేయుటకు, తెల్లజాతులు, ఒండొంటిని మించుటకు ప్రయత్నములు సల్పుచున్నారు. అప్పుడు ధర్మయుద్ధ మనునది యుండనేయుండదు. నిరపరాధులును నిరాయుధులునగు ప్రజలు, యీ ప్రళయాగ్నిలో ఆహుతులు గాకతప్పరు. ఇట్టి వినాశనకాలము

రాకుండ అంతర్జాతీయసమితి నెలకొల్పబడినను, దీనిలో చేరిన పెద్దరాజ్యములే యీ క్రూరకార్యమునకు గడంగు చున్నారు. కాబట్టి యేదేశమునకుగాని మహాత్మా గాంధిగారి సత్యాగ్రహవిధానమే శరణ్యము—దౌర్జన్యము నేమాత్రము కనుపరచినను, తెల్లజాతులు నలిపి పారవేయుట తప్పక తటస్థించును. యేజాతిగాని సహాయనిరాకరణవిధానమును అవలంబించ గలిగినయెడల, పాశ్చాత్యుల మారణయంత్రములు వారిని భానిసలుగ చేయజాలవు. అట్లు చేయజాలనపుడు, తెల్లవారు నల్లజాతులవారిని తమ స్వలాభమున కుపయోగించుకొనజాలరు. కాబట్టి మున్ముందు, సమిష్టివాదము పెరిగి, మానవసౌభ్రాతృత్వమునకు త్రోవ చూపినకొలది, యీ అంతర్జాతీయ న్యాయశాస్త్రములోని యుద్ధనియమము లన్నియు ఆచరణలోనుండి తప్పిపోవును. ధనికులు—బీదలు—యజమానులు—పనివాండ్రు — భూఖామందులు — రయితులు, వీరి వీరి మధ్యభేదములు అంతరింపజేయు సాంఘిక రాజకీయార్థికవిప్లవములు బయలుదేరువరకు మానవసౌభ్రాతృత్వము, ఆధ్యాత్మికనిరాడంబరజీవనము మొదలగు పలుకులు సారహీనమగు వట్టి పొడిమాటలుగ నెంచబడక తప్పదు.

6—6—31<br>కొవ్వూరు } వల్లూరి సూర్యనారాయణరావు

---

# విషయసూచిక

# అంతర్జాతీయధర్మశాస్త్రము

## Priliminary 1.

## అధ్యాయము I

### NATURE OF INTERNATIONAL LAW.

### అంతర్జాతీయధర్మస్వభావము

ప్రపంచములో నాగరికరాష్ట్రములని వాడబడుచున్న వానికి, ఒండొంటితో గల సంబంధమును నిర్ధారణచేయు నిబంధనలను తెలియచేయునది అంతర్జాతీయధర్మశాస్త్ర మనబడును. ఈ నిబంధనల నమలులో పెట్టుట కీ రాష్ట్రముల కన్నిటికిని, ఒక పైయధికారి లేనప్పటికి, నీ నిబంధనల ననుసరించియే రాష్ట్రములన్నియు సాధారణముగా నడచుకొనుచుండును. శాంతసమయము లందును, యుద్ధసమయము లందునుకూడ కావలసిన ధర్మము లీ శాస్త్రమందుండును. ప్రస్తుతము అమలులో నున్న నిబంధనలను తెలియజేయుచు, వీనిలో నెట్టిమార్పులు కలిగిన యెడల బాగుగ నుండునో, యీ విషయముకూడ యీ శాస్త్రములో చర్చించబడుచుండును. రాష్ట్రములకు తగవులు సంభవించినప్పు, డింతవరకు ఆచారమెట్లున్నదియు రాజ్యతంత్రజ్ఞులు తెలిసికొనుట కీ శాస్త్రమున శోధించెదరు. ఈ యాచారమును కని పెట్టుటయే

యీ శాస్త్రముయొక్క ప్రధానోద్దేశముకాని, యీ యాచారములలో నేయే మార్పులు అవసరమో యీ విషయము కూడ శాస్త్రజ్ఞులు చర్చించుటవలన నూతనాచారము లవలంబింపబడుచుండును. ఇట్టి నూతనాచారములను రాష్ట్రము లవలంబించ నంతవరకు అవి విధ్యుక్తధర్మములుగా నెంచ బడవు.

---

## అధ్యాయము II

---

### ITS APPLICABILITY

### ఎట్టి రాష్ట్రములకీ శాస్త్రము వర్తించును?

చిన్న రాష్ట్రములైనను, కొంతవరకు నాగరికతకలవై సంపూర్ణస్వాతంత్ర్యము కలిగియున్న యెడల నివి అంతర్జాతీయరాజ్యకుటుంబములో చేరినవని చెప్పవచ్చును. యూరపు ఖండములో నుండు ఇంగ్లాండు, ఫ్రాన్సు, జర్మనీ, ఆస్ట్రియా, యిటలీ, రష్యా దేశములును, అమెరికా సంయుక్తరాష్ట్రమును తాము ఒండొంటితో నేర్పరుచుకొను ధర్మములనే, యీ చిన్న రాష్ట్రములుకూడ అవలంబించుచుండును. పైని చెప్పిన పెద్దరాష్ట్రములే చిన్నరాష్ట్రములకు మార్గదర్శకములు. ఇవి యన్నియు క్రిస్టియను దేశములైనను, వీని ననుసరించియే, టర్కీ, జపాను, చైనా మొదలగు ప్రాగ్దేశరాష్ట్రములు నడుచు

కొనుటకు ప్రయత్నించుచుండుటచేత వీనికి కూడ నీ ధర్మశాస్త్రము వర్తించుచున్నది.

మన యిండియా దేశముగాని, దీనిలో నుండు రాజ్యములుగాని సంపూర్ణస్వాతంత్ర్యములు లేక, యింగ్లాండు క్రింద నుండుటచేత, ఆంగ్లేయు లేర్పరుచుకొను ధర్మములే మనధర్మములుగాని, మనకు యితరనాగరిక రాష్ట్రములతో నెట్టిసంబంధము పెట్టుకొను నధికారములేదు. మనదేశ మితర నాగరిక రాష్ట్రములచేత నొక ప్రత్యేకరాష్ట్రముగ నెంచబడక ఆంగ్లేయసామ్రాజ్యములో నొకభాగముగ పరిగణింపబడుచున్నది. మనకంటె వేయిమడుంగులు స్వాతంత్ర్య మనుభవించు ఇంగ్లాండు వలసరాజ్యములుకూడ స్వతంత్రరాష్ట్రములుగ నెంచబడక, లండను నగరమందుండు బ్రిటిషుసామ్రాజ్యాధికారము క్రిందనున్న ట్లెంచబడుచున్నవి. పరనాగరిక రాష్ట్రపాలురు, వీనిలో రాజకీయవ్యవహారములను జరుపరు. అటుల జరుపుటకు వలనుపడదు. ఈ అసంపూర్ణస్వాతంత్ర్య రాజ్యమును, తమపై నధికారముగల రాజ్యములమీద తిరుగుబాటుచేసి, సంపూర్ణస్వాతంత్ర్యము సంపాదించుకొన గలిగినపుడు, వీనిని స్వతంత్రరాష్ట్రములుగా తక్కిన రాష్ట్రములు భావించి, తమరాష్ట్రకుటుంబములో చేర్చుకొనుచుందురు.

---

## అధ్యాయము III

---

## SOURCES OF INTERNATIONAL LAW

### అంతర్జాతీయధర్మోత్పత్తిస్థానములు

ఇంతవరకు బయలువెడలిన గొప్ప గొప్ప గ్రంథములలోను, ముఖ్యమైన నాగరికరాష్ట్రములు తమలో తాము చేసికొన్న సంధులలోను, యుద్ధసమయములో నివి యేర్పరుచుకొను ప్రైజు కోర్టుల తీర్పులలోను, యీ రాష్ట్రములయొక్క కాన్ఫరెన్సుల తీర్మానములలోను, మధ్యవర్తుల తీర్పులలోను, రాజకీయధురంధరులు తమ దేశము పక్షమున ప్రకటించు రాజకీయపత్రములలోను, వారు తమయుద్యోగస్థులకు పంపుచుండు సలహాలలోను సీ అన్యోన్యరాష్ట్రధర్మము లిమిడియున్నవి. ఇవి సహేతుకములైన యెడల క్రమక్రమముగ నాగరిక రాష్ట్రములన్నియు, వీనిని బట్టి నడచుకొనుచుండును. దీనివలన ఆచారములు బలమై రాష్ట్రములకు విధ్యుక్తధర్మములగుచుండును. పూర్వకాలములోకూడ మన దేశములో కొన్నిధర్మము లున్నటుల శుక్రనీతిసారము, భారతము, కౌటిల్యుని అర్థశాస్త్రము మొదలగు గ్రంథములలో కానవచ్చుచున్నవిగాని, యిప్పటి నాగరికరాజ్యములకు గల అన్యోన్య సంబంధములు, పూర్వకాలములో లేకుండుటచేత దినదిన ప్రవర్ధమానమగుచున్న యీ ధర్మశాస్త్రము, అప్పు డంతగా

నవసరము లేకపోయెను. ఇప్పటి సమస్యలు పూర్వకాలమందు జనుల నెంతమాత్రము బాధించియుండవు. జనసంఖ్య అభివృద్ధియైన కొలది, ప్రపంచమంతయు జనులు క్రిక్కిరిసి, తమ జీవనము వాణిజ్యము మీదనే యాధారపరుచుకొని, పొట్టకూటికి ఒండొరులతో దేశములకొరకు జగడమాడుచు పొగయోడ, రైల్వే, తంతి, ఆకాశగమనముల మూలమున దూరమును హ్రాస్వముచేసి, వివిధరాజ్యప్రజలకు ప్రతిదినము నన్యోన్యసంబంధమును కలుగఁజేయుచుండు నీ కాలములో సంశ్లిష్టసంబంధము లనేకము లుండి తీరును. వీని కన్నిటికి కొన్ని ధర్మములు బయలువెడలుచుండవలయును.

ఇంగ్లాండు, అమెరికా శాస్త్రజ్ఞు లిదివరకు తమ కోర్టులలో జరిగిన తీర్పులనుబట్టి, నూతనాచారములను నిర్ధారణ చేయుచుందురు. ఫ్రాన్సు, జర్మనీ మొదలగు యూరపు ఖండరాజ్యములు తమ గ్రంథకర్తలు వ్రాసిన పుస్తకములను, తాము పరరాష్ట్రములతో చేసికొన్న సంధులను అనుసరించి నడచుకొనుచుండును. ఏది యెట్లున్నను, పెద్దరాష్ట్రము లన్నిటియంగీకారము లేనిదే యే నిబంధనగాని, యే రాష్ట్రమును నిర్బంధించనేరదు. తాము ఒప్పుకొన్న నిబంధనలనే, తమ కనుకూల మగునపుడు, కొన్ని రాష్ట్రములు అతిక్రమించుట తటస్థపడుచున్నను, మొత్తముమీద బహురాష్ట్రాభిప్రాయమును గమనించియే నాగరిక రాజ్యము లన్నియు ప్రవర్తించుచున్నవి.

ప్రతిరాష్ట్రమునకు శాంతసమయములో నుండుకొన్న హక్కులు, విధులు, యుద్ధసమయములో కొంతవరకు మారుచుండును. కాబట్టి శాంతసమయములో నుండవలసిన రాష్ట్రధర్మములను చర్చించి యుద్ధసమయములో యుద్ధతుల యొక్కయు, (belligerents) తటస్థులయొక్కయు (Neutrals) హక్కులను విధులను గురించి వ్రాసెదను.



# PART I

# మొదటి భాగము



## శాంతిసమయ నియమములు

## LAWS OF PEACE.

# అ ధ్యా య ము I

---

## RIGHTS AND DUTIES OF FREE STATES.

### స్వతంత్రరాష్ట్రముల హక్కులు, విధులు.

ప్రతి సంపూర్ణ స్వాతంత్ర్యరాష్ట్రము, తన కిష్టము వచ్చినటుల తన లోపటి వెలుపటి రాచకార్యములను వ్యవహరించుకొనుచు, తన సోదరరాష్ట్రములకుగల హక్కులకు తాను భంగము కలుగజేయకూడదు. వీనిలో కొన్ని రాష్ట్రములు చిన్నవిగా నుండుటచేతగాని, పెద్దవియైనను యుద్ధములో బలహీనమగుటచేతగాని వీని సంపూర్ణ స్వాతంత్ర్యమునకు కొన్ని మేరలను పెద్దరాష్ట్రము లేర్పరుపవచ్చును. ఇట్టి కట్టుబాట్లు ఆ రాష్ట్రములకు కొంతబలము రాగానే త్రెంచివేయబడుచుండును.

సంఘములో నుండు వ్యక్తి తన పరిపూర్ణస్వాతంత్ర్యమును తన సోదరులయెడల నెట్లుపయోగించకూడదో, అటులనే, ఒక రాజ్యము తాను రాష్ట్రసంఘములోకలసియున్నంతవరకు తన సంపూర్ణ స్వాతంత్ర్యపుహక్కును వినియోగించి, రాష్ట్రసంఘముయొక్క మనస్సునకు నొప్పి కలుగజేయకూడదు. వీనిలో నిచ్చిపుచ్చుకోలును, కలసికట్టుతనమును ఉండవలయును. తా నొక రాష్ట్రమును తిరస్కరించినయెడల, అది తన్ను తిరిగి తిరస్కరించును. తన వాణిజ్యాభివృద్ధికి, యితర

దేశములనుండి వచ్చు సరకులమీాద సుంకము వేసినయెడల, తన సరుకులమీాద ఆదేశములు సుంకము వేయును. కాబట్టి పరరాష్ట్రముల యభిప్రాయములను, ముఖ్యముగా తన యిరుగుపొరుగురాష్ట్రముల యభిప్రాయములను సదా గమనించుచుండవలయును.

ఒక రాష్ట్రము తన రాజ్యాంగతంత్రమును మార్చుకొనవచ్చును. దేశపరిపాలనలో అనేక సంక్షోభములు పుట్టవచ్చును. పాలకులకును పాలితులకును జగడము ప్రారంభమై విశేషరక్తపాతము కలుగవచ్చును. తాను ఒక పరరాష్ట్రముతో యుద్ధము ప్రారంభించవచ్చును. ఈ సమయములో తటస్థముగ నుండవలసిన మరియొకరాజ్యము జోక్యము కలుగజేసికొనుట న్యాయ్యముకాదు. తాను సలహా నీయవచ్చును కాని, తన బలపరాక్రమముల నుపయోగించి, మరియొక రాష్ట్రమును నిర్బంధించకూడదు. జగడము చేయుచున్న ఉభయపార్టీలును, తన్ను మధ్యవర్తిగా కోరుకొన్నపుడుగాని, లేక ఒక పార్టీవారు తన్ను సలహామాత్రము అడిగినప్పుడు గాని, తాను కొద్దిగ జోక్యము కలుగజేసికొనవచ్చును. తనంతట తాను, పరరాష్ట్రవివాదలలో సంబంధము పెట్టుకొనగూడదు. తన మాటను వారిలో యే పార్టీవారైనను వినలేదని, తన శౌర్యమును వారియెడల చూపించకూడదు.

ఎట్టిసమయములందు, ఒక రాజ్యములో జరుగు విప్లవములలోగాని, రెండురాజ్యములకు జరుగు యుద్ధములో

గాని, యితరరాజ్యములు జోక్యము కలుగజేసికొనవచ్చునో యీ సమస్యను తృప్తికరముగ పరిష్కరించుట బహు దుర్లభము. దీనినిగురించి, రాజ్యతంత్రజ్ఞులలోను, గ్రంథకర్తలలోను అనేకవిధములైన భిన్నాభిప్రాయము లున్నవి. మన కీచర్చలో, ఆచారము సహకారి కానేరదు. అనేకవందలసంవత్సరములనుండి, యెన్నియోసారు లిట్టి జోక్యములు సంభవించుటవలన క్రొత్తయుద్ధములు ప్రారంభమై వాని న్యాయాన్యాయములనుగురించి నేటివరకును శాస్త్రజ్ఞులు భిన్నాభిప్రాయులరై యున్నారు. ప్రతిరాష్ట్రము, నీ జోక్యములను గురించి కొన్ని విధు లేర్పరచుకొని, తిరిగి మరియొక సమయములో వీనిని త్యజించి మరియొకవిధమైన క్రొత్తసూత్రములను ప్రతిపాదించుచుండెను. అయిన నిట్టి జోక్యములను కలుగజేసికొను విషయములలో, కొన్ని ముఖ్యమైన సందర్భములను తెలిపెదను.

తన స్వరక్షణకొరకు, ఒకరాష్ట్ర మితరరాష్ట్రముల వ్యవహారములలో జోక్యము కలుగజేసికొనవచ్చును. పరరాష్ట్రముయొక్క స్వాతంత్ర్యపు హక్కుకంటె, ఆత్మసంరక్షణపు హక్కు ఎక్కువ బలీయమైనదని చెప్పవచ్చును. మన యాస్తిని కాపాడుటకు కొన్ని చట్టము లేర్పడియున్నవని అందరకు తెలిసిన విషయమే. కాని పరరాజులు యుద్ధమునకు వచ్చినపుడు, యుద్ధసంబంధమైన పనులకు, మిలిటరీయుద్యోగీయులు, మనయాస్తిని ధ్వంసము చేయవలసివచ్చును, లేక

శత్రువుల స్వాధీనములోనికి రాకుండ, దానిని తాము బలాత్కారముగ తీసికొనవచ్చును. ఈ విధముగనే, ఆసన్నమైన అపాయమును తప్పించుకొనుటకు పరరాష్ట్రముల వ్యవహారములలో జోక్యము గలుగజేసికొనవచ్చును. కాని యీఅపాయము తత్క్షణమే తనకు తప్పకుండ కలిగి తీరునదిగ నుండవలెనుగాని యెన్నడో ముందు రాబోవునేమో యనునదిగ నుండకూడదు. ఇదిగాక, ప్రజానష్టమును ద్రవ్యనష్టమును పొందవలసి వచ్చునంత అపాయము తనకు తటస్థించవలెను. తన పొరుగుననున్న రాజ్యముయొక్క ప్రస్తుతపు చేష్టలు ముందెన్నడో తన కపాయము కలిగించవచ్చునని, యిప్పుడే దానితో యుద్ధమునకు దిగకూడదు. అటులైన యెడల, ముందు ఏబదిసంవత్సరములకు వచ్చు యుద్ధము నాపుటకు రాష్ట్రములన్నియు నిప్పుడే యుద్ధములు ప్రారంభించి, సదాయుద్ధరంగమందే యుండవలెను. ఇంతేగాక, ఒకరాష్ట్రము, తాను జోక్యము కలుగజేసికొనవలెనన్న, యుద్ధము చేయవలసినంత కారణముండవలయును. యూరపు సంగ్రామములో సింగ్లాండు ఫ్రాన్సులు, జర్మనీతో యుద్ధము చేయుచుండుటకు ఈకారణమే చెప్పినయెడల, వీరు జర్మనీ రష్యాదేశములమధ్య జరుగు పోరాటములో జోక్యము కలుగజేసికొనుట కేవలము అక్రమమని చెప్పక తీరదు.

కొన్నిరాష్ట్రములమధ్య యేర్పడిన సంధులను బట్టి వానికి పరరాష్ట్రముల వ్యవహారములలో జోక్యము కలుగజేసి

కొను హక్కులేర్పడవచ్చును. కాని యిట్టి హక్కులను కలుగఁ జేయు సంధులు అవ్యక్తమైనవనియు, అనాలోచనతో చేయ బడునవనియు, అట్టి సంధిపత్రములకు దస్కతు పెట్టిన రాష్ట్రి ములు తుదకు కష్టములపాలై, తమకు సంభవించు యిబ్బందు లలో నుండి బయటకు గౌరవముతో రాలేవనియు, గట్టిగ నమ్మవలయును. తమస్నేహితులు చేయదలచుకొన్న యుద్ధ ములు న్యాయ్యమైన వైనను, కాకపోయినను, తాము వారికి సహాయముచేయుటకు దొరకొనుట భావ్యము కాదు. ఫ్రాన్సు రష్యాలు అట్టి సంధిని యేర్పరచుకొన్నంతమాత్రము చేతనే కదా ఫ్రాన్సు అనవసరముగ జర్మనీ రష్యాలపోరులో 1914 వ సంవత్సరములో జోక్యమును కలుగజేసికొనెను. ఇది యం తయు నీ శాస్త్రప్రకారము న్యాయ్యము కాదు.

ఒక రాష్ట్రము ఇతరరాష్ట్రవ్యవహారములలో అన్యాయ ముగ జోక్యము కలుగజేసికొన్నయెడల మరియొకరాష్ట్రము దానిమీదకు యుద్ధమునకు పోయి దాని అన్యాయజోక్య మునకు ఆటంకమును కలుగజేయవచ్చును. స్వలాభాపేక్ష లేశమైనను లేనపు డిట్టి యాటంకము న్యాయ్యమైనదనే చెప్పవలయును. ఒకరాష్ట్రము తనస్వాతంత్ర్యమును గౌరవ మును కాపాడుకొనుట యెంత అనింద్యమో, తనస్నేహి తుని స్వాతంత్ర్యమును, గౌరవమును కాపాడుటకూడ అంత అనింద్యమే కాని, తన ప్రజలను, ధనమును, తనస్నేహితుని రక్షణ కుపయోగించి, దానికి గలిగిన అన్యాయమును తొల

గించుటకు ప్రయత్నించుట, ఒకానొకప్పుడు తనరాష్ట్రప్రజలకు అపరిమితమైన నష్టమునకు కారణమగుచుండును. ఇట్టి సమయములో, తన కెంతమంచియుద్దేశములున్నను, తనప్రజల మీఁద నధిక పన్నులు వేయుట తటస్థించి ప్రజానష్టమును ధననష్టమును కలుగజేయుట నింద్యార్హము.

తన ప్రజలయెడల కనపరుపవలసిన విధాయకధర్మములను త్యజింపవలసివచ్చును. 1915 వ సంవత్సరములో శెర్వియా ఆస్ట్రియాలకుమధ్య యుద్ధకారణ మేర్పడినపుడు, రష్యావారు జోక్యము కలుగజేసికొనుటకు న్యాయమైన కారణము లేదు. అది అకారణముగ జోక్యము కలుగజేసికొన్నదిగనుక, ఆస్ట్రియాస్నేహితుడైన జర్మనుచక్రవర్తి అట్టి అన్యాయ జోక్యమును తీసివేయుటకు యుద్ధము ప్రారంభించెను. ఇది యీశాస్త్రప్రకారము న్యాయమే. కాని, యుద్ధమునకు దిగకుండ, తగిన సలహాల నుభయపార్టీల కిచ్చి, తన ప్రజలకు నష్టము రాకుండ నితడు చేయలేకపోయెనా యను విషయమునుగురించిమాత్రము భిన్నాభిప్రాయము లుండవచ్చును.

పరరాష్ట్రములో ప్రజలయెడల పాలకుల క్రూరత్వమును పోగొట్టుటకును, అక్కడ ఒకలే మతమును అవలంబించవలయునని వారి నిర్బంధన తొలగించుటకును, యేరాష్ట్రమైనను జోక్యము కలుగజేసికొనవచ్చునని కొందరి గ్రంథకర్తల యభిప్రాయముకాని, యిట్టి హేతువులనుబట్టి జరిగించు జోక్యము లన్నియు అశాస్త్రీయములు. జర్మనీదేశ

మునకును, ఫ్రెంచి దేశమునకును మధ్యనున్న బెల్జియము చిన్న
రాష్ట్రముమీదుగా, యీ రెండిటికిని జరుగు యుద్ధములలో,
వాని సైన్యములునడుపకూడదనియు, అట్లు వీనిలో నేరాజ్య
మైనను జరిగించినయెడల నింగ్లాండు దేశము, తక్కిన రెండు
రాజ్యములకు సహాయము చేయవలయునని 1831, 1839
సంవత్సరములలో ఒడంబడికల నేర్పరుచుకొని, యీయేర్పాటు
1870 సంవత్సరములో జర్మనీ ఫ్రాన్సులకు జరిగిన యుద్ధమున
అమలులో పెట్టబడినది. 1915 సంవత్సరములో జరిగిన మహా
సంగ్రామములో జర్మనీవారు తటస్థరాజ్యముగ నుండవలసిన
బెల్జియముగుండా ఫ్రాన్సుమీదకు దండెత్తుట, తమ పూర్వపు
ఒడంబడికల నుల్లఘించుటయే. అట్టి ఒడంబడిక చేసికొనుటయే
తప్పు—ఏలననగాఁ తన రెండువైపుల దేశములవారగు
ఫ్రాన్సు రష్యారాష్ట్రములు తనమీదకు దుముకినపుడు తన
ప్రాణరక్షణార్థము ఒకదానిని ముందుగ జయించి రెండవ
దానిమీదకు పోవలెనుగాన, బెల్జియముయొక్క తటస్థతను
నిలుపుటకు వీలు లేదు. కాబట్టి ఆ ఒడంబడిక ఫ్రాన్సు జర్మ
నీలమధ్య యుద్ధము జరగినపుడేగాని, వీనిలో దేనికైనను
మరియొక రాష్ట్రము సహాయము చేసినయెడల, అమలులో
నుంచవలసిన ప్రసక్తి లేదు. కాబట్టి ఫ్రాన్సువారిని, రష్యా
వారి సహాయమునకు పోకుండ నింగ్లాండువారు మందలించి
యున్నయడల, బెల్జియముయొక్క తటస్థతను జర్మనీవారు
పోగొట్టకుండ నుందురు. అప్పుడు బెల్జియములో జరిగిన

ఘోరసంగ్రామమునకు అగత్యమే లేకపోయియుండును. ఈ సంగ్రామములో యింగ్లాండు, ఫ్రాన్సు, జర్మనీ, రష్యా, ఆస్ట్రియా, శెర్వియా, జపాను, బెల్జియము మొదలగు దేశముల నడతనుగురించి భిన్నాభిప్రాయములు కలవని నాకు తెలియును. నిజము నిలకడమీాద వెల్లడి కాగలదు.

అన్ని నాగరికరాష్ట్రములుగాని, వీనిలో గొప్ప రాష్ట్రము లన్నియుగాని ప్రపంచములో నెమ్మదికి భంగము కలుగకుండ కొన్నికొన్ని చిన్నరాష్ట్రముల నెప్పటికిని తటస్థముగ నుంచవలసియుండును. అట్టి తటస్థత కే రాష్ట్రము భంగము కలిగించినను తక్కిన రాష్ట్రములు దానితో యుద్ధముచేసి ఆ తటస్థతను నిలుపవలసియుండును. కాని ఆత్మసంరక్షణపుహక్కునకు, యిట్టి హక్కు లన్నియు లోబడియుండవలసినదనియు, అటుల లోబడక తీరదనియు, ఆంగ్లేయ దేశమునకు చాలాకాలము మంత్రిగా నున్నట్టియు, రాజ్యతంత్రప్రవీణుడయినట్టియు గ్లాడ్స్టనుమహానుభావుడే సెలవిచ్చియున్నాడు.

ఒకరాజ్యములో అంతఃకలహములు సంభవించునపుడు ఒక పార్టీవారు పరరాజుల సహాయము నడుగుచుందురు. ఏ పార్టీవారినాదన న్యాయమైనను, అట్లు జోక్యము కలుగజేసికొనుట న్యాయముకాదు. ప్రతిరాజ్యములోని ప్రజలు తమ కుచితమని తోచినరీతిని తమ రాజ్యాంగమును నిర్మించుకొనుచుందురు. వారి పాలకులును, పరిపాలితులును, అనేకవిధ

యములలో చట్టములు కననుకూలముగకూడ జగడమా
చుందురు. దీనితో పరరాష్ట్రములకు పనియేమి ?

నేటివరకు యూరపుఖండములో నే రాష్ట్రముకూడ
తక్కిన రాష్ట్రములకంటె బలముగలదిగ కాకుండ చేయ
వలయునను ఒక రాజ్యతంత్రసూత్రము చాలాకాలమునుండి
వ్యాపించియున్నది. దీనినే Balance of Power అని వా
దరు. ఈ సూత్రమును ఆధారము చేసికొని రెండు శతాబ్ద
ములనుండి అనేకయుద్ధములు జరుగుచు వచ్చినవి. కొన్ని
రాష్ట్రములు తమ సంరక్షణకు వేరువేరుగ యితర రాష్ట్రము
లతో సంధులను చేసికొనుచుండెను. రెండు రాష్ట్రములకు
ఒకరాజే యున్నయెడల అవి యెక్కువబలముగలవి యగునని
తక్కిన రాజ్యములు వానితో యుద్ధము చేయుచుండెను. తమ
తమ స్వలాభము నిమిత్తము ఆయారాష్ట్రములు క్రొత్త
కారణములు కల్పించుకొనుచు, నూతన రాజకీయసూత్రముల
నేర్పరుచుకొనుచు, తమ కవి యనుకూలము కానపుడు వానిని
త్యజించుచున్నవి.

ఏరాష్ట్రములోను విప్లవములు రాకుండగను, నిరం
కుశాధికారులచే రాష్ట్రములు పరిపాలింపబడవలెనుగా
ప్రజాప్రతినిధులచేత పాలింపబడకుండుటకును ప్రజల రాజ
యాందోళనములను తగ్గించుటకును 1815 వ సంవత్సరములో
జర్మనీ, రష్యా, ఆస్ట్రియావారు ఒక సంఘముగా యేర్పడి
దీనిని Holy Alliance అని పేరు పెట్టుకొనిరి. ఇది ని

ముగా అపవిత్రమైన సంఘము గనుకనే, తక్కిన రాష్ట్రముల వారు దీనితో యుద్ధముచేసి అణగద్రొక్కిరి. ఫ్రాన్సు, యింగ్లాండు, అమెరికా, యిటలీ, హాలెండు, స్విట్జర్లెండు మున్నగు దేశములు, యీసంఘములో చేరలేదు. ఈ దేశము లలో ప్రజాస్వామికమే ప్రబలినది. టర్కీరాజ్యమువారు జరిగించిన ఘోరకృత్యములవలననే తక్కినయూరపుఖండ రాష్ట్రములు న్యాయముగ జోక్యము కలుగజేసికొని, తమ కెట్టి ఫలాపేక్షయు లేకుండ, తమ రక్తమును ధనమును ధారవోసి, గ్రీసు, మాంటినీగ్రో, రొమేనియా, సెర్వియా మొదలగు రాజ్యములు తమ స్వాతంత్ర్యమునకై పోరాడినపుడు సహాయము చేసినవి. కాని కొందరు శాస్త్రజ్ఞులు, ఈ సహాయమునకు వచ్చిన రాష్ట్రములు రష్యాదేశము వారిమీదగల అసూయచేతనే, యీ రాజ్యములకు సహాయము చేసినవనియు, నీ యుద్దేశముచేతనే రష్యావారిమీద టర్కీవారు యుద్ధము జరిగించినపుడు, టర్కీవారికి సహాయము చేయుట, 1910 వ సంవత్సరములో బాల్కనురాష్ట్రములయుద్ధములలో తమ రేవిధముగను జోక్యము కలుగజేసికొనకపోవుట, తటస్థించెననియు అభిప్రాయపడుచున్నారు.

ఈ ప్రపంచములో నుండు పెద్ద రాష్ట్రములు కలసి తమలో నెక్కువమంది యభిప్రాయమునుబట్టి రాష్ట్రములు ఒకదానితో నొకటి పోరాడకుండ జోక్యము కలుగజేసికొన వలెననే ఒక ఒడంబడికయుండిననే తప్ప, లేనియెడల యుద్ధ

ములు జరుగుచునేయుండును. బలాత్కారముగ మధ్యవర్తు
లకు తమ తగాయిదాలను వదిలిపెట్టించుటకు రాష్ట్రముల
కిట్టిసంఘము ఒకటి యుండవలయును. ఇట్టిది లేనపుడు పెద్ద
రాష్ట్రములు తమ ఆశకు మేర యుంచుకొనక గిల్లి కయ్య
ములు తెచ్చిపెట్టి లాభమును పొందుచునేయుండును. ఇట్టి
సంఘము నొకదాని నేర్పరచవలయునని 1918 లో జరిగి
యున్న ఘోరసంగ్రామములో కలుగు ద్రవ్యనష్టము జననష్ట
మును జూచి అమెరికా ప్రెసిడెంటుగారగు విల్సను మొదలగు
కొందరు రాజ్యతంత్రజ్ఞులు కఠినముగ వ్రాసి, చిన్నరాజ్యముల
కును ఇప్పుడు సంపూర్ణస్వాతంత్ర్యములేని దేశములకును
సంపూర్ణస్వాతంత్ర్యము నీయకపోవుటచే, నిట్టి సంఘము 12
సంవత్సరములనుండి పని చేయుచున్నను ప్రాగ్దేశరాజ్యము
లకు మోక్షము కలుగుట దుర్లభ మగుచున్నది.

---

## అ ధ్యా య ము II

---

### రాష్ట్రముల సొత్తుతో సంబంధించిన హక్కులు, విధులు.

### ( Rights and duties in regard to state property )

ప్రస్తుతనాగరిక రాజ్యముల కన్నిటికి, నిర్దిష్టమైన
మెల్లలు గలవు. ఆ మెల్లలమధ్యనుండు దేశము, దానిలో
నుండు సరస్సులు, నదులు, ఖనిజములు సమస్తపదార్థములు

ఆ దేశప్రభువులవే. కొన్ని నదులు రెండుమూడు దేశముల గుండా ప్రవహించుచున్నయెడల, నేదేశములోని ప్రవాహము, ఆ దేశస్థులదే. ఆ నది రెండుదేశముల సరిహద్దులో ప్రవహించుచున్నయెడల, ఆ ప్రవాహము మధ్యవరకు నున్న జలము, దీవులు, జలచరములు ఆయా ప్రక్క దేశములవారికి చెందును. రెండుదేశముల మధ్యనున్న సరస్సులకుగూడ నీ నిబంధనయే వర్తించును. సముద్రపువంచగల దేశములకు, సముద్రతీరమునందుగల పాటుప్రదేశమునుండి మూడుమైళ్ల వరకుగల సముద్రము ఆయా దేశములవారిదే. పూర్వము సముద్రతీరమునుండి ఫిరంగి ప్రేల్చినయెడల, తుపాకిగుండు మూడుమైళ్లవరకు పోవుచుండెను గనుక, అంతవరకున్న సముద్రము, ఆ దేశసంరక్షణ కేర్పరచబడినది. ఈ కాలములో కనీసము 12 మైళ్లవరకు గుండు పోవునుగనుక, యీ 12 మైళ్ల సముద్రము, ఆయా దేశప్రభువుల యధికారమునకు లోబడవలయునని కొన్ని రాష్ట్రములు ప్రయత్నించుచున్నవి గాని, యింతవరకు వారి ప్రయత్నములు కొనసాగలేదు.

దేశమునకు అంటియున్న సముద్రశాఖలు, అఖాతములు, ఉప్పుకొయ్యలు మొదలగునవి ఆ దేశప్రభువులవే. వీనియొక్క వెడల్పు, ఆరుమైళ్లకంటె నెక్కువయున్నను, రెండు తీరముల యగ్రములను కలిపి ఒక గీత గీచినయెడల, నీగీత పొడుగు 12 మైళ్లకంటె నెక్కువ కాకుండ నుండునప్పుడు ఈ సముద్రశాఖంతయు ఆదేశపువారిదే యని గ్రంథకర్త

లభిప్రాయపడుచున్నారు. ఆ గీతనుండి సముద్రములోనికి మూడుమైళ్ళవరకున్న జలభాగముకూడ ఆ దేశస్థులదే. ఒక దేశము లోనుండు జలసంధి దాని రెండుతీరములనుండి మూడు మైళ్లు లెక్కించగా, దాని వెడల్పు ఆరుమైళ్లకంటె నెక్కువ కానియెడల, యావత్తు జలసంధియు ఆ దేశస్థులదే. అది రెండురాష్ట్రముల మధ్య నున్నయెడల, నిద్దరకు చెరి మూడు మైళ్లవరకు చెందును. ఆరుమైళ్లకంటె నెక్కు వున్నయెడల అన్ని దేశస్థులవారికిని, దాని మధ్యభాగము చెందియుండ వలెను. దేశమునకు అంటియుండు పెద్ద అఖాతములు తమవే యనియు, తమ ప్రజలే అక్కడి జలచరములను పట్టుటకు అధి కారము గలవారనియు వాదించుచు, కొన్ని రాష్ట్రముల వారు తగాయిదాలను పడి సంధులను చేసికొనుచున్నారు. దేశమునకు అంటియుండు సముద్రములో దీవు లేర్పడిన యెడల, అవి ఆ దేశములోనుండి కొట్టుకొనివచ్చిన ఒండు వలన నేర్పడినటుల భావించతగిన వైనపుడు, ఆ దేశము వారికే చెందవలయును. రాష్ట్రములు నూతన దేశముల నీ క్రిందివిధముగ సంపాదించుకొనుచుండును.

(1) అనాగరిక దేశముల యాక్రమణ—నాగరిక దేశ వాసులు, అనాగరికులు నివసించు ప్రదేశములలో చొరబడి, తమరు పరిపాలించగల దేశ మంతయు తమ హక్కే యని నిర్ధారణ చేసికొనియున్నారు. ప్రస్తుతము, నాగరికరాష్ట్ర ములవారి స్వాధీనములో లేని దేశము యీ ప్రపంచములో

లేదు గనుక, యీ విషయ మంతగా చర్చించనవసరము లేదు. ఆఫ్రికాఖండములో నిట్టి ప్రదేశము లక్కడక్కడ కొన్ని యున్నను, యూరపుఖండవాసులు, అచ్చటి యనాగరిక జాతులవారికి సంరక్షణకర్తలమని చెప్పుకొనుచున్నారు. ఆఫ్రికాఖండ మంతయు నింగ్లాండు, జర్మనీ, ఫ్రాన్సు, పోర్చుగల్, బెల్జియము, యిటలీ, హాలెండు మొదలగు దేశముల వారు పంచుకొని అక్కడి యనాగరికజాతులవారిని కొందరు క్రూరముగాను మరికొందరు కొంచము దయతోను పాలించుచు, వారు చేయు పనులకు తామే జవాబుదారులమని చెప్పుకొనుచున్నారు. ఈ విషయమై 1886, 1890, 1891 సంవత్సరములలో పైని చెప్పిన రాష్ట్రములమధ్య కొన్ని ఒడంబడికలు జరిగినవి. ఈమధ్య యూరపు ఘోరసంగ్రామానంతరము ఇంగ్లాండువారు జర్మనీనుండి ఆఫ్రికాలో చాలా భాగము లాగుకొన్నారు.

(2) ఒడంబడికలవలన సంపాదన—ఒక రాష్ట్రము వారు మరియొకరాష్ట్రమునకు క్రయమూలమునగాని, దానరూపమునగాని, మార్పుడువలనగాని కొంత దేశము నీయవచ్చును. అమెరికావారు, అమెరికాలో రషియావారికిగల దేశమును 1867 వ సంవత్సరములో విక్రయించుకొనిరి. యుద్ధములో ఓడిపోయిన దేశము, జయము నొందిన దేశముతో సంధి చేసికొనునపుడు, కొంత దేశమును రెండవదానికి యిచ్చుకొనుట తటస్థించును, 1871 వ సంవత్సరములో జర్మనీవారి

వలన ఫ్రాన్సువారు పరాజితు లైనపుడు, ఆల్సేసులొరేను దేశములు జర్మనీవారి కీయవలసివచ్చెను. యూరపు ఘోర సంగ్రామానంతర మీ రెండు రాష్ట్రములును తిరిగి ఫ్రాన్సు వారి కీయవలసివచ్చెను.

(3) బలాత్కారపు ఆక్రమణ—ఇది సాధారణముగా యుద్ధములలో తటస్థించును. 1914 వ సంవత్సరపు యూరపు యుద్ధములో జర్మనీవారు బెల్జియము నగతయు ఆక్రమించు కొనిరి. యుద్ధాంతమందు నూతన ఒడంబడిక లేనియెడల వీ రాక్రమించుకొన్న దేశము వీరిక్రిందనే యుండిపోవును. కాలక్రమమున అది వీరికి చెందిపోయినట్లుగ నెంచబడును. కాని, వీరు ఓడిపోవుటచే బెల్జియము తిరిగి స్వాతంత్ర్యము ననుభవించుచున్నది.

పూర్వము కొన్ని రాష్ట్రములు మహాసముద్రములను కూడ పంచుకొనుచుండెను గాని, యిటీవల యిట్టి పిచ్చి కోరి కలు నశించినవి. కొన్ని సముద్రశాఖలవద్దనుండు యిరుగు పొరుగురాజ్యములు మాత్రము విలువగల జలచరములను పట్టు కొనుటకు ఒడంబడికలు చేసికొనుచున్నవి. కాని ప్రతిదేశపు పొగమోడలు, ఆ ప్రదేశములగుండ పోవచ్చును. రెండు మహాసముద్రములను కలుపు కాలువలు మొదలగు జలభాగ ములగుండా, అక్కడి రాష్ట్రములవారి స్నేహితు లందరు తమ నావలను నడుపుకొనవచ్చును. అట్లు నడుపుటకు ఒప్పు కొనినందుకు, ఆ జలభాగములు గల రాష్ట్రములకు కొంత

సుంక మిచ్చుచుండుట ఆచారమై యున్నది. కాని యిట్టి ఆచారము ఈ కాలములో నశించినదని చెప్పవచ్చును. యుద్ధసమయములయందుకూడ స్నేహితుల యుద్ధపుటోడలు కూడ, యే సుంకము నీయనక్కరలేకయే పోవుచుండును. ఇవి మరియొక రాష్ట్రముతో యుద్ధము చేయుటకు పోవుచున్నను, ఈ జలభాగములలో, నెమ్మదికి భంగము కలుగనంత వరకు, వీనిని ఆపుటకు వలనుపడదు. కాని యీ యోడలు, తమతో యుద్ధము చేయు దేశీయుల వైనయడల, వానిని యాపుదల చేయవచ్చును. టర్కీవారి యధీనములో నున్న డార్డినెల్సు, బాస్ఫరస్సు జలసంధుల విషయములోమాత్రము కొన్ని నిబంధన లేర్పడినవి. టర్కీవారి కిష్టమైనయెడల శాంతసమయములలో తన స్నేహితుల యుద్ధపు టోడలను ఈ జలసంధులగుండ రానీయవచ్చును. తన కిష్టము లేనిచో విదేశీయ రాయబారులను తీసికొనిపోవు ఓడలను తప్ప తక్కిన ఓడల నన్నిటిని ఆపివేయవచ్చును. ఇది న్యాయ శాస్త్రమునకు వ్యతిరేకమైనను యూరపుఖండరాజ్యములు తమలో తమకు తగ్గవులు తటస్థించకుండ టర్కీవారితో నిట్టి ఒడంబడికను 1856-1871 సంవత్సరములలో చేసికొని యున్నవి. ఈ ఒడంబడిక ననుసరించియే టర్కీదేశము సదరు రెండు జలసంధులను, రష్యావారికి, ఫ్రెంచివారికి, ఆంగ్లేయులకును కూడ మూసివేసినది. ఇంతమాత్రముచేత, దీని తటస్థతకు భంగము లేదు.

సూయజు కాలువనుగురించి మనము కొంచము చర్చించవలసియున్నది. దీనిని త్రవ్వినపుడు, ఈ స్థలము నాగరిక రాష్ట్రములలో చేరని యీజిప్టు వారిదై యున్నది. ఈదేశము మొదట టర్కీవారి రాజ్యములో చేరినదైనను, దీని గవర్నరు (Khedive) సంపూర్ణస్వాతంత్ర్యము గలిగి, పేరునకు మాత్రము టర్కీసుల్తానుగారి సంరక్షణక్రిందనే యున్నట్లు, కొద్ది సంవత్సరముల క్రిందటివరకు ఆయనకు కొంత కప్పము కట్టుచుండెను. వీరి యుభయుల ననుమతి మీదనే, మధ్య ధరా సముద్రమును, యవనసముద్రమును కలియునటుల, యూరపు ఖండ రాజ్యములన్నిటి యుపయోగమునకు ఫ్రెంచిదేశస్థులు ఒక కంపెనీగా యేర్పడి 1869 వ సంవత్సరములో నీ కాలువను త్రవ్వించిరి. ఈకంపెనీలో, మన ఆంగ్లేయులకు చాలా భాగము లున్నవి. 1888 వ సంవత్సరములో యూరపుఖండ రాజ్యములు, ఈ కాలువవిషయమై ఒక నిబంధన నేర్పాటు చేసి కొన్నవి. శాంత సమయములలోను, యుద్ధ సమయములలోను, అన్ని దేశముల వర్తకపు టోడలు, యుద్ధనావలు కూడ నిరాటంకముగ పోవచ్చును. ఈకాలువలో గాని, దీని రెండు ముఖద్వారములకు మూడుమైళ్ల దూరములో గాని ఒక యోడ మరియొకదానితో యుద్ధము చేయఁగూడదు. ఈ కాలువను యేరాష్ట్రముగాని మూయకూడదు. యుద్ధనావలు, దీని ముఖద్వారములయందు 24 ఘంటలకంటె యెక్కువ కాలము నిలువగూడదు. యుద్ధతులు, యీ కాలు

వలోగాని, దీని ఒడ్డులనుండు రేవులలోగాని, సైన్యము, మందు గుండు సామానులను దించకూడదు. వానిని యెగుమతి చేసి కొనగూడదు. ఈజిప్టు ఖెడైవుగారును, టర్కీసుల్తానుగారు నీ కాలువ కిరుప్రక్కలను కోటలను కట్టకూడదు. దీనిని అపాయములనుండి సంరక్షించు భారముమాత్రము వారిది. యూరపు ఘోరసంగ్రామానంతరము యీసూయజుకాలువ అన్ని జాతులవారును స్వేచ్ఛగా నుపయోగించునట్లు ఏర్పడెను.

గొప్పనదులు ఒక దేశములో నున్నపుడు, ఆనదుల మీాద విదేశీయులు తమ యోడలను స్వేచ్ఛగ నడుపవచ్చునా యనునది చర్చనీయాంశముగానే యున్నది. ఈ నదులు సంపూర్ణముగ నొకదేశములోనే యున్నయెడల, తగవులకు కారణమేలేదు. శాంతసమయములలో సామాన్యముగ ఆ దేశములు అడ్డు కలిగించుటయేలేదు. యుద్ధసమయములలో, తమ వీలునుబట్టి విదేశీయ నావలను రానీయకుండ చేయవచ్చును. నదులు రెండుమూడు దేశములగుండ పారుచున్నపుడు ఒకదేశమునుండి మరియొక దేశపునావలు పోవలసి వచ్చుచుండును. అట్లు పోవుటకు, ఒకదేశమున కిష్టములేనపుడు ఆనది పారుచున్న యితర దేశముల నావల కధికార మున్నదా యను విషయములో శాస్త్రజ్ఞులు భేదాభిప్రాయు లగుచున్నారు. పూర్వ మీా నదీప్రవాహములుగల రాష్ట్రములు సుంకములు వేయుచుండెను. రైను, ఎల్బు 1815 వ సంవత్స

రములోను, డాన్యూబు 1856 వ సంవత్సరములోను, సెంటు లారెన్సు 1871 వ సంవత్సరములోను, ఆనదులు పారుచున్న రాష్ట్రములు కొంత సుంకము వేసికొని తమ యోడలను నడపించుకొనుటకు ఒడంబడిక లేర్పరుచుకొన్నవి.

---

## అధ్యాయము III

---

### రాష్ట్రాధికారముతో సంబంధించిన హక్కులు, విధులు.

**(Rights and duties in regard to persons in a state.)**

రాష్ట్రాధికారులు తమ రాష్ట్రములోనుండు ప్రజలందరి మీదను, ఆస్తిమీదను అధికారము కలిగియున్నారు. తమ దేశములో స్థిరముగనుండువారును, వారికి పుట్టినవారును తమ పౌరులలో చేరుదురు. విదేశీయులుకూడ నీ రాష్ట్రచట్టములనుబట్టి వీరి పౌరులలో చేరవచ్చును. తమ పౌరులకు అన్యదేశములలో పిల్లలుకలిగినపుడు, ఆపిల్లలుకూడ తమ పౌరులలో చేరెదరాయను విషయమును గురించి, నాగరిక రాజ్యములు అనేకవిధములగు చట్టములను నిర్మించుకొన్నవి. ఇంగ్లాండును, అమెరికాయును, అట్టి పిల్లలను తమ పౌరులుగానే భావించుకొనెదరు. వారిమీద తమయధికారమును చెలాయించెదరు. విదేశీయులకు తమదేశములో పిల్లలు కలిగినయెడల, వీరినికూడ తమ పౌరులలో చేర్చుకొనెదరు.

ఫ్రాన్సువారు ఆపిల్లలను తండ్రిలదేశపు పౌరులుగనే భావించె దరు. ఫ్రెంచి తల్లితండ్రిలకు ఇంగ్లాండులో పిల్లలు కలిగిన యెడల, వీరిని బ్రిటిషుపౌరులుగనే ఆంగ్లేయు లెంచెదరు. ఫ్రెంచివారు వారిని తమ పౌరులుగ నెంచెదరు. ఇట్టి విష యములలో చిక్కులు సంభవించునుగనుక, ఆపిల్ల లేదేశము నందుందురో, ఆదేశపు న్యాయశాస్త్రములకు లోబడవలయు నని, కొన్ని రాష్ట్రిము లొండొంటితో నొడంబడికలు చేసి కొనుచున్నవి. మరికొన్ని రాష్ట్రిములలో, ఆపిల్లలు మేజరు లైన తరువాత, తమకిష్టమువచ్చిన పౌరత్వమును స్వీకరించ వచ్చును. లంజలకు పుట్టినవారు తమ తల్లుల దేశముననే చేరియుందురు.

విదేశీయులనుకూడ తమ పౌరులలో చేర్చుకొనుటకు కొన్ని రాష్ట్రిములు నిబంధనలను చేసుకొన్నవి. ఈనిబంధనలు (Naturalization Laws) అని పిలువబడును. రాష్ట్రిములో నొకరు విదేశస్త్రీని పెండ్లిచేసికొన్నయెడల ఆ స్త్రీకూడ తన పెనిమిటి జాతీయతనే గ్రహించును. దీనికి వేరుగ చట్టమక్కర లేదు. విదేశీయుడు తానున్న దేశములో పౌరత్వము సంపా దించుకొనవలెనన్న కొంత నియమిత కాలము అక్కడ గడపిన తరువాత క్రమమైన ప్రమాణపత్రికలను ఆ రాష్ట్రాధికారుల పేర వ్రాసి యీయవలెను. ఈయనతిరిగి తన జన్మభూమికి వచ్చినయెడల, నే ప్రభుత్వమునకు లోబడియుండవలెను? కొన్ని రాజ్యములవారు, వీరు యేదేశములో నున్నను మిలి

టరీ నౌఖరీ తమకు చేయక తప్పదనియు తమ జన్మదేశము తరఫుననే యుద్ధముచేయవలెననియు, తమ జన్మభూమితో యుద్ధము చేయువారిలో చేరినయెడల వీరిని చంపవచ్చుననియు శాసనము లేర్పరుచుకొని యున్నారు. అమెరికావారును, ఇంగ్లీషువారును, తమదేశస్థులు విదేశములలో పౌరత్వము సంపాదించుకొన్న తరువాత, వారిమీద తమ కేవిధమైన స్వాతంత్ర్యములు లేవని చట్టము లేర్పరుచుకొనిరి. ఈ రెండు దేశములలో విదేశీయులు పౌరత్వమును సంపాదించుకొన్న యెడల, వారి జన్మభూమిలో తప్ప, తక్కిన దేశములకు వారు వెళ్లినప్పుడు, వారిని సంరక్షించు బాధ్యత యీ దేశముల వారు వహించక తప్పదు. ఏ మనిషిగాని తనపౌరత్వమును మార్చుకొనవచ్చును. అనేక దేశములను తిరిగిన తరువాత చాలాకాలమునకు తన జన్మభూమికి వచ్చి, అక్కడనే నివాసము చేసికొనవలెనన్న మిక్కిలి సులభముగా దానిపౌరుడు కావచ్చును.

కొందరు విదేశీయులు, ఒకదేశములో బహుకాలము నుండి నివసించుచున్నను, వాని పౌరత్వమును సంపాదించు కొనకుండ నుండవచ్చును. అయినను, వీరికి కొన్నిహక్కులు కలవు. నిర్దిష్టకాలమును ఏర్పరుచుకొనక స్థిరముగా కాపుర మున్న మనిషి మరియొక దేశము పౌరుడుగా నుండవచ్చును. తండ్రియొక్క స్థిరనివాసత్వమే (Domicil) కొడుకులకును వచ్చును. వీరు మేజర్లయిన తరువాత తమస్థిర నివాసత్వమును

మార్చుకొనవచ్చును. యుద్ధసమయములలో వీరియొక్క హక్కులను, విధులను ముందు తెలియజేసెదము. శాంత సమయములలో, నివాసమేర్పచుకొన్న దేశచట్టముల ప్రకారము నడచుకొనవలయును.

విదేశీయులు, మరియొక దేశములో నుండిపోవుచున్నపుడు, ఆ దేశముయొక్క క్రిమినల్ చట్టములకు లోబడియుండవలెను. కంట్రాక్టులు చేసినయెడల, అక్కడి కోర్టుల చట్టములకు లోబడవలెను. తమ స్వదేశరాజకీయ హక్కులను పోగొట్టుకొనరు.

ఒకవ్యక్తి తానొక దేశములో స్థిరనివాసముచేసికొని మరియొక దేశములో స్థిరాస్తి సంపాదించుకొనవచ్చును. స్థిరాస్తి విషయములో దాయభాగము, ఉయిలు హక్కులు, కంట్రాక్టులు, దావాలు మొదలగువానికి, ఆ స్థిరాస్తియున్న దేశపుచట్టములే వర్తించును. చరాస్తివిషయములో తనస్థిరనివాసము చేసికొన్న దేశచట్టములే సాధారణముగా వర్తించును. కాని యీ సూత్రములకు కొన్ని నిషేధములున్నవి. వానిని యీ క్రింద వివరించుచున్నాను.

(1) ఒకదేశముయొక్క ఓడలు, ఏ పరదేశములలో నున్నను, తమ స్వదేశాధికారమునకు లోబడియుండవలయును. ఈ యోడలలోని నావికులు, విదేశస్థులైనను, ఆ నావలు యే దేశమువారివో, ఆ దేశప్రభుత్వముయొక్క అధికారమునకు లోబడవలెను. ఒకదేశమునకు పిదేశవర్తకపు టోడలు వచ్చి

నప్పుడు, ఆ నావలును, వాని నావికులును, వారు దిగిన దేశ చట్టములకు లోబడవలయును. ఆ నావలలో నేరములు జరిగిన యెడల, అవి నిలచియున్న దేశపరిపాలకులు, ఆ యోడలలోనికి పోయి నేరస్థులను పట్టుకొని, వారు తమ దేశములోనికి వచ్చినట్లుగనే పరిగణించి విచారించెదరు. ఫ్రాన్సు దేశములో మాత్రము విదేశనావలు వచ్చినపుడు, వాని నావికులలో నేరము జరిగినయెడల, ఫ్రెంచివారు జోక్యము కలుగఁజేసికొనుటలేదు. ఆ నావికులు తమ ఓడయందుండు బాటసారుల మీఁదగాని, సముద్రతీరమందున్న జనులమీఁదగాని, నేరము జరిగించిన యెడల, వారిని ఫ్రెంచివారే విచారణచేయుదురు. ఈ ఫ్రెంచివారి ఆచారమును, మరికొన్ని రాష్ట్రములు ఇటీవల ఆమోదించి, ఒండొంటితో సంధుల నేర్పాటు జేసికొనుచున్నవి. ఈయాచారము, క్రమక్రమముగ పరస్పరపు టొడంబడికలలోనే గాక యీ న్యాయశాస్త్రములో నొక సూత్రముగ భావింపబడును.

(2) ప్రతి దేశమునకు తనయోడలు నడిసముద్రము మీఁదనున్నపుడు, వానిమీఁదను, వానిలో నుండు నావికులు, ప్రయాణికులు మొదలగువారి మీఁదను, సంపూర్ణాధికారము కలదు. మరి యే యితర దేశమును జోక్యము కలుగ జేసికొనఁగూడదు. ఆ యోడలను సోదాచేయుటకు వలనుపడదు. యుద్ధసమయములలో తటస్థుల వర్తకపు టోడలను యుద్ధతులకు సోదాచేయగల హక్కున్నను, ఆతటస్థ రాజ్యముల పబ్లికు

ఓడలను సోదా చేయకూడదు. అట్లు చేసినయెడల, వారి ప్రభుత్వముతో నీ యుద్ధకులు జోక్యము కలుగజేసికొనుటలుగ నెంచబడును. తటస్థరాజ్యముల కిట్టి హక్కులుకలవు గనుకనే, తమ ఓడలమీద జరుగు నేరములును, వాని నావికు లితరులమీద జరిగించు నేరములును, తాము విచారించి శిక్షించు చుండవలయును.

ఫ్రాన్సుదేశపు రాజుగారగు నెపోలియన్‌గారితో నాంగ్లేయులు యుద్ధము చేయుచున్నపుడు, అమెరికావారి వర్తకపు టోడలలో నుండు ఆంగ్లేయ నావికులను బలాత్కారముగ ఆంగ్లేయులు తీసికొనపోవ మొదలుపెట్టిరి. అప్పుడు అమెరికావారు, అట్టిపని అన్యాయమని అడ్డుకలిగించిరి. ఈ కారణముచేతనే, యీ యుభయులకు 1812 వ సంవత్సరములో యుద్ధము జరిగి తుదకు 1814 వ సంవత్సరములో సంధిచేసికొనిరిగాని యీ విషయమై యేమియు వ్రాసికొనలేదు. కాని 1842 వ సంవత్సరములో అమెరికా మంత్రిగారగు వెబ్‌స్టరు గారు, విదేశీయుల కిట్టి యధికారము లేదని స్పష్టముగ తెలియజేసిరి. నేటివరకు ఆంగ్లేయు లిట్టిపనులు జరిగించలేదు గనుక వీరీ హక్కును వదులుకొన్నట్లే యెంచబడవలయును.

(3) ప్రతిరాష్ట్రము, తనపౌరు లేదేశములోనున్నను, వారిమీద నధికారము చెలాయించవచ్చును. వారిని, తమ స్వదేశమునకు వచ్చినపుడు మాత్రమే అది విచారించగలదు.

నాగరికరాజ్యము లన్నియు, తనుమీాఁద, తను ప్రజలు విదేశములలో జరిగించు నేరములకు, వారు తమ దేశము రాగానే విచారించవచ్చును. ఏయే నేరములకు వారిని తమ దేశమునకు విచారణనిమిత్తము పంపివేయవలయునో తాము విదేశీయులతో నేర్పరుచుకొను సంధులను (Extradition treaties) బట్టి యుండును. తమ పౌరులు విదేశీయ యోడల మీాద జరిగించు నేరములకు, విదేశప్రభువులే విచారించవచ్చును. వారు విచారించక పోయినను, తామే వారిని తమ దేశమునకు వచ్చిన తరువాత విచారణ చేయవచ్చును. వారు విదేశములలో గాని విదేశీయ ఓడలలో గాని ఉన్నంతవరకు, తాము వారిని విచారణచేయుటకు వలనుపడదు. అనాగరిక రాష్ట్రములలో తమ పౌరులు నేరములు జరిగించి, అక్కడనే వారున్న యెడల తమ ఉద్యోగస్థులను పంపించి విచారణచేయించి, శిక్షింపవచ్చును. కాని అనాగరిక దేశములలో నైనను విదేశీయుల మీాద తాము అధికారము చెలాయించకూడదు.

(4) ఓడదొంగలు, అన్నిరాష్ట్రములకు విరోధులే గనుక, వారి యోడలు నడిసముద్రములో నెక్కడ కనుపించినను, ఏ రాష్ట్రమైనను పట్టుకొనవచ్చును. ఆ దొంగలను శిక్షించవచ్చును. ఒక నాగరిక ప్రభుత్వమునకు లోబడి యుండి, ఓడ దొంగతనము జరిగించినయెడల, ఆ నేరస్థులను, వారి రాష్ట్రమునకు ఒప్పగించి శిక్షింపజేయవలెను. యుద్ధతులని యెన్నబడు రాష్ట్రముల పేరు మీాద అన్యాయమైనపనులు

విదేశీయులమీద జరిగించినయెడల నేరములుచేసినవారి రాష్ట్రాధికారులకు తెలియజేయవలసినదేకాని, వారిని యే యితర రాష్ట్రములవారును శిక్షించకూడదు. యుద్ధతుల యుభయుల వద్దను అధికారమును పొంది పరరాష్ట్రినావలను కొట్టుటకు మొదలుపెట్టినవారిని ఓడదొంగలుగ నే రాష్ట్రమువారైనను శిక్షించవచ్చును. నాగరికరాష్ట్రముల యధికారములులేని ప్రదేశమందు, ఏదేశపు అధికారమునకు లోబడక ఒకరొకడ తగినంత భయము కలుగజేసి బలాత్కారముగ ప్రజలకు హాని కలుగజేయుటగాని వారి యాస్తి నపహరించుటగాని, లా ప్రకారము ఓడ దొంగతన మగుచున్నది.

ఒక రాష్ట్రము తనలోనుండు ప్రజలమీదను, ఆస్తి మీదను, సంపూర్ణాధికారము కలదనియు, నీ సూత్రమునకు కొన్ని నిషేధములు కలవనియు చెప్పియుంటిమి. అవి యేవియన—

(1) విదేశప్రభువులు వారి పరివారము, ఒక దేశములోనికి వచ్చినపుడు, వారును, వారి యాస్తియు, తమరు వచ్చి ప్రవేశించిన దేశమువారి యధికారమునకు లోబడవు. వీరిమీద శివిలుక్రిమినల్ చర్యలు జరిగించకూడదు. వీరు తాము దర్శించవచ్చిన రాజ్యముమీదగాని, ఆ రాజ్య ప్రజలమీదగాని నేరములు జరిగించినయెడల, లేక ఆ దేశములోనుండు నేరస్థులకు తమవద్ద తా వొసంగినయెడల ఆ రాజ్యమునుండి వెడలగొట్టబడుదురు. కాని వీరిని విచారణ

చేసి శిక్షించకూడదు. విదేశములను జూడవచ్చిన రాజు తానే న్యాయాధిపతిగనుండి, తనపరివారములోనివారినైనను, ఆదేశములలో విచారించి శిక్షించకూడదు. అట్టినేరస్థులను తనదేశమునకు పంపి తనకోర్టులచేత విచారణచేయించవలెను. ఒకరాజు మారుపేరుతో విదేశములలో తిరుగుచున్నపుడు అతను నేరముచేసినయెడల అక్కడనే విచారణ చేయవచ్చునుగాని, తాను విదేశీయ రాజునని చెప్పుకొనగానే ఆవిచారణను ఆపివేయవలయును.

(2) విదేశ రాయబారులు, తమకు నియమింపబడిన దేశములో నున్నపుడుగాని, ఆ దేశముల కితర దేశములగుండ పోవుచున్నపుడుగాని, ఆ దేశములనుండి వచ్చుచున్నపుడుగాని వీరును వీరిపరివారమును, వీరికుటుంబమును, వీరియాస్తియు ఆ యా దేశములవారి యధికారములోనుండవు.

(3) విదేశసైన్య, మే పరరాష్ట్రములోనికైనను, ఆ రాష్ట్రాధికారుల యనుమతిలేనిదే పోగూడదు. సంధిమూలమునగాని, మరి యే యితర యొడంబడికల మూలమున గాని, అట్టి యనుమతి పొందినపుడు, సైన్యములో నుండువారు నేరము లేమిచేసినను వారి సేనానాయకుడే శిక్షించ వలయునుగాని ఆ దేశ ప్రభువులు జోక్యము కలుగజేసికొనగూడదు. యుద్ధనావ లెట్టి అనుమతి లేకుండగనే విదేశీయ రేవులకు పోవచ్చును. తగినకారణము లేకుండ వానిని రానీయ

మని యేరాష్ట్రమువారును ఆజ్ఞాపించకూడదు. యుద్ధసమ యములలో తటస్థరాజ్యములు యుద్ధతులలో ఉభయపార్టీల యోడలు రాకూడదని చెప్పవచ్చును. యుద్ధనావలు పర రాష్ట్రముల రేవులలో నున్నపుడు, ఆ రాష్ట్రప్రభువులు వానిని యెంతమాత్రము చెనకగూడదు. అయినను, రేవులకు సంబం ధించిన నియమములను, ఆరోగ్యరక్షణోపాయములను, అన్ని యోడలు గమనించవలయును. రేవులోదిగిన యుద్ధతుల నా వలు, తటస్థరాజ్యహక్కులకు భంగముచేయకూడదు. ఆ యుద్ధతులలో నొకరు తమ విరోధుల యోడలను తటస్థరాజ్యపు రేవులకు తెచ్చినపుడు వానిచర్య సరిగానున్నదా లేదాయని నిర్ధారణచేయుటకు ఆ తటస్థరాజ్యపు ప్రైజుకోర్టులకు లో బడవలయును. విదేశయుద్ధనావలు తటస్థరాజ్య నౌకాశ్రయము లకు వచ్చినపుడు అక్కడి నేరస్థులకు ఆ యోడలలో నాశ్ర య మీయకూడదు. ఆ యోడనాయకునికి తెలియకుండగ, ఒక నేరస్థుడు అట్టినావలో దాగియున్న యెడల నీ సంగతి తెలియగనే అతనిని అధికారులకు ఒప్పగించవలెను. ఆ నేరస్థుడు రాజకీయసంబంధమైన నేరము చేసినయెడల అతని నట్లు ఒప్పచెప్పకూడదు. తక్కిన నేరస్థుల నైనను రప్పించు కొనుటకు నావనాయకునిని గాక వాని దేశప్రభువునే అడుగ వలెను. ఇక విదేశీయయుద్ధనావనాయకులను గురించి వేరుగ చెప్పనక్కరలేదు. దానిలో దాగుకొన్న తమదేశపు నేరస్థు లను బలాత్కారముగ బయటకు లాగుటకు దేశప్రభువుల

కధికారములేదు. రాజద్రోహులకు సాధారణముగ విదేశ ప్రభువుల యోడలు ఆశ్రయ మీయకూడదు. వారు తమప్రాణమునకును, స్వేచ్ఛకును అపాయము కలుగుచున్నదని భయపడి, తమ దేశపు రేవులలో నున్న విదేశీయయుద్ధనావలోనికి పోవుటకు ప్రయత్నించుచున్నపుడు, ఆ నావనాయకుడు, అతనికి శరణము నీయవచ్చును. ఆ నేరస్థుడు మరియొక దేశమునకు పారిపోయి ఆ దేశపునావ నెక్కి తన దేశపు రేవులకు వచ్చినను, అతని దేశమువారు పట్టుకొనగూడదు. కాని, విదేశీయవర్తకపుటోడలు మాత్ర మిట్టివారికి రక్షకస్థానము నీయగూడదు. దేశములో చట్టము లెంతఅన్యాయముగనున్నను, ప్రభుత్వము యెంతప్రజాపీడనమైనను, దానిని యెదిరించుట యెంతన్యాయమైనను ఆ దేశపునేరస్థులకు విదేశీయవర్తకపు నావలు ఆశ్రయమీయకూడదు. ఆ దేశాధికారులు, ఆ నావలలోనికిపోయి వారిని పట్టుకొని ఒడ్డునకు తీసికొనివచ్చి విచారించి శిక్షించవచ్చును. కాని ఆ విదేశనావమీద తుపాకులను కాల్చి అగౌరవపరచకూడదు. పారిపోయిన బానిసలు తమ ప్రాణరక్షణార్థము వారి దేశములో నున్న విదేశప్రభువుల ఓడలలోనికి వచ్చినయెడల, వారికి ఆశ్రయము నీయవచ్చును గాని, అపాయము గడచిన తరువాత వారిని పంపివేయవలెను. అట్లు పంపనియెడల, ఆ దేశమువారు, ఆ నావనాయకుని ప్రభుత్వమువారితో చెప్పుకొనవలసినదేగాని, ఆ నాయకుని నిర్బంధించుటకు, అతని నావలోనికి పోకూడదు. విదేశీయనావలో

నుండు నావికులు మొదలగువారు ఒడ్డునకు రాగానే, దేశ చట్టములకు లోబడవలయును. వారక్కడ నేరములు చేసిన యెడల శిక్షింపబడుదురు.

(4) పశ్చిమదేశవాసులు తూర్పుదేశములలో నున్నపుడు, నూతనసూత్రము లేర్పడినవి. తూర్పుదేశములు, అనగా ఆసియా, ఆఫ్రికాఖండములలోని స్వదేశరాజ్యముల కోర్టులలో న్యాయము జరుగదని పాశ్చాత్యులు, తమవీలుకొరకు కొన్ని నిబంధనల నీ తూర్పుదేశప్రభువులతో చేసికొనియున్నారు. టర్కీ, బార్బరీదేశములు, చీనా, జపాను, సయాము మొదలగు దేశప్రభువులలో పాశ్చాత్యదేశముల పౌరులను విచారణ చేయుటకు, ఆ దేశములవారే తమ కోర్టులను (Consular Courts) వేరుగ నేర్పరుచుకొనుటకు ఒడంబడికలుచేసికొనిరి. ఈ ఒడంబడికలనుబట్టి యూరోపియనులు, అమెరికనులు, శివిలు క్రిమినల్ విషయములలో తమ రేర్పరుచుకొన్న కోర్టులలోనే, తమ స్వదేశములలో విచారణ చేయబడవలయును. వీరిమీద ఆ దేశీయులు నేరము జరిగించినపుడు, ఆ దేశపు కోర్టులే విచారించవచ్చునుగాని, యీ విదేశీయులు, స్వదేశస్థులమీద నేరములు జరిగించినపుడు, ఈ విదేశీయకోర్టులలోనే విచారణజరుగవలెను. ఒక విదేశస్థునిమీద మరియొక విదేశీయుడు నేరము జరిగించినయెడల, నేరము చేసిన విదేశీయుని, అతని ప్రభుత్వమువారు స్థాపించిన కోర్టులలోనే విచారించవలెను. ఉభయులు ఒక విదేశముయొక్క పౌరులైన

యెడల, ఆ దేశపుకోర్టులలో విచారించబడవలయును. శివిల్
వ్యవహారములలో, విదేశీయుని స్వదేశీయుని మధ్యనుండు
తగాయిదాలను ఉభయరాష్ట్రములవారు నేర్పరుచుకొన్న
జడ్జీలుగల కోర్టులలో విచారణజరుగవలెను. ఉభయులు విదే
శీయులైన యెడల, ఏ రొక్కజాతివారైనపుడు, వారికోర్టు
లలోను, భిన్నజాతివారైనపుడు, వీరిలో ప్రతివాది ప్రభుత్వము
వారేర్పరచిన కోర్టులలోను విచారణజరుగును. అప్పీళ్లు ఆయా
కోర్టులవారి స్వదేశములలో నున్న పైకోర్టుల కుండును. క్రిమి
మినల్ కేజులలో ఉరిశిక్షలు లేక గొప్పకఠినశిక్షలు, పైవారి
యుత్తరువులవలన ఖాయపడవలయును. ఒకప్పుడు గొప్ప
నేరములను చేసినవారిని, వారిదేశములకు విచారణనిమిత్తము
పంపివేయుదురు.

ఈజిప్టుదేశములో నిట్టి విదేశీయకోర్టులకుబదులు అంత
ర్జాతీయకోర్టులను 1876 వ సంవత్సరములో స్థాపించిరి. స్వదే
శీయులనుండి కొందరిని విదేశీయులనుండి మరికొందరిని,
ఖడైవుగారు యేరుకొని వీ రుభయులను కలిపి న్యాయస్థాన
ముల నేర్పరచెదరు. ఈ న్యాయస్థానములలో నెక్కువమంది
విదేశీయులుగ నుండవలెను. ఖడైవుగారు, ఈ విదేశీయ
న్యాయాధిపతులను, వారివారి గవర్నమెంటుల సలహాలతో
నేరుకొనవలయును. ఈ మిశ్రమపుకోర్టులు పైని చెప్పిన
Consular Courts కంటె బాగుగ పని చేయుచున్నవి.

(5) ఒక దేశములో నేరముచేసి మరియొక దేశమునకు నేరస్థుడు పారిపోయినయెడల, మొదటి దేశమువారి కోరికమీద రెండవదేశమువారు వానిని పంపివేయుట స్నేహభావమై యున్నది. ఇట్లు చేయక రెండవదేశమువారే విచారించుటగాని లేక యూరకొనియుండుటగాని తటస్థపడుచుండుటచేత, నాగరికరాజ్యము లన్నియు నేరస్థులను, నేరములను జరిగిన దేశములకు పంపివేయుటకు ఒడంబడిక చేసికొన్నవి. ఆఒడంబడికలలో (Extradition treaties) నేయే నేరములకు నేయే షరతులమీద నేరస్థులను ఒప్పచెప్పవలెనో స్పష్టముగ వ్రాయబడును. ఆనేరము మోపబడినవాడు నేరము చేసినటుల కొంత సహేతుకమగు సాక్ష్య ముండవలెను. పారిపోయివచ్చిన విదేశీయులకు, ఆ దేశప్రభువుల పొడిమాటలను నమ్మి ఒప్పించుట న్యాయముకాదు. ఇదిగాక యే నేరమునకు ఒప్పజెప్పమని కోరిరో ఆ నేరమునకే విచారింపబడవలెను గాని, అత డదివర కెన్ని నేరములను చేసినను, ఆ నేరములకు విచారింపబడకూడదు. ఒడంబడికలలోలేని నేరములకు అతనిని విచారించనేకూడదు.

రాజకీయసంబంధమైన నేరములకు, నేరస్థులను ఒండొరుల రాష్ట్రములకు ఒప్పజెప్పకూడదని యీఒడంబడికలన్నింటిలో వ్రాయబడుచున్నదిగాని, అట్టినేరముల స్వభావ మిట్టిది అను విషయమునుగురించిన వాదములు మిక్కిలి చిక్కులతో నిండియున్నవి. గ్రంథకర్తలలోను, రాజ్యనీతినిపుణులలోను,

న్యాయాధిపతులలోను భేదాభిప్రాయము లున్నవి. కొందరు నేరస్థుని యుద్దేశమునుబట్టి యుండునని చెప్పుదురు. అటు లైనయెడల రహస్యహంతకు లందరు శిక్ష తప్పించుకొన వచ్చును. మరికొందఱు నేరస్థుడు చెప్పినపని, ఒక రాజకీయ సంబంధమగు ప్రయత్నములలో జరిగియున్నయెడల అతనిని ఒప్పజెప్పకూడ దందురు. 1890 వ సంవత్సరములో స్విట్జ ర్లండులో జరిగిన ఒక పితూరీలో, ఒకడు మరియొక మనిషిని చంపి యింగ్లాండుకు పారిపోయెను. వీనిది రాజకీయసంబంధ మైన నేరమని యింగ్లాండువారు అతనిని ఒప్పజెప్పక నిరాక రించిరి. ఈ రెండు అభిప్రాయములు అసంతృప్తిగనేయున్నవి. నేరస్థుని యుద్దేశములను గ్రహించుట దుస్తరము. రాజకీ యాందోళనములో విప్లవములు లేక స్వల్పపితూరీలు జరుగు చుండును. వీనిలో కొందరు చంపబడవచ్చును. ఒక రాష్ట్ర ప్రభుత్వమును కొందరు ప్రజలు ఎదిరించి రాజకీయవిప్లవ మును కలిగించుచున్నపుడు కొందరు చంపబడినను, హంత కులు విదేశములకు పారిపోయినచ్చినప్పుడు, వీరిని హత్యా నేరముక్రింద ఒప్పజెప్పకూడదు. ప్రభువులను, ప్రజలను యుద్ధతులుగ భావించినయెడల, యుద్ధనియమములకు లోబడి యే కార్యములను జరిగించినను, అటుల చేసినవారిని పర రాష్ట్రములు ఒప్పజెప్పకూడదు. వీరు చేసినపనులు, అనా లోచనలోను దూరదృష్టిలేకను, తెలివితక్కువగ చేయబడిన పని మన మెంచినను, వారి దేశములో నున్నంతవరకు

శిక్షార్హు లైనప్పటికి, విదేశీయులు వారిని ఒప్పజెప్పకూడదు. కాని రాజకీయ విప్లవమని పేరుపెట్టి రహస్యముగ పరిపాల కులలోనివారినిగాని, తాము విరోధు లనుకొన్న వారినిగాని హత్య కావించినయెడల నిట్టి పనులు యుద్ధసమయములలో జరుగకూడదు గనుక అట్టి పనులు చేసినవారిని, విదేశప్రభు వులు పట్టుకొని ఒప్పజెప్పవచ్చును. ఒక కోట ముట్టడిలో ఒకప్పుడు తమ రాజుగారినే చంపవచ్చునుకాని అకస్మాత్తుగ నెమ్మదిసమయములో ఒక గుంపులోనుండి ఒక బాంబును తమ రాజుగారిమీాద వేసి ఆయనను చంపినయెడల, ఆ హంతకుని విదేశీయులు ఒప్పజెప్పుట న్యాయమే.

ఇంగ్లాండువారును, అమెరికావారును తమ దేశస్థులు విదేశములలో నేరములు జరిగించినపుడు వారిని, ఆ విదేశ ప్రభువులకు ఒప్పజెప్పెదరు. మరికొన్ని రాష్ట్రములు తమరే విచారించెదరుగాని నేరములు జరిగించిన దేశప్రభువుల కప్ప గించరు. ఈ రెండవమార్గము న్యాయమైనదిగ కనుపించదు. విదేశ న్యాయాధిపతులు సరిగా విచారించనియెడల ఆ దేశ ప్రభువుల కావిషయమును తెలిపి, ఆ నేరస్థుని స్వదేశపరి పాలకులు, అతనికి న్యాయము కలుగునటుల తగిన హేతువు లను కనుపరచి మందలించవచ్చును.

---

# అధ్యాయము IV

---

## రాష్ట్రసమత్వముతో సంబధించిన హక్కులు, విధులు.

## Rights and duties in regard to equality of States.

సంపూర్ణస్వాతంత్ర్యముగల రాష్ట్రములు చిన్నవైనను పెద్దవైనను, ఈ యంతర్జాతీయరాజ్యతంత్రములో, సమాన ములే. కొన్ని పెద్దరాష్ట్రములకు బలము పలుకుబడి యుండ వచ్చును గనుక, యేదియో నొక నిషమీద నీ పెద్దరాజ్య ములు చిన్నవానిని బాధించుచునే యున్నవి. బయట కివి యన్నియు నీతితో ప్రవర్తించుచునే యున్నామని చెప్పుకొ నుటయేగాని, అన్యాయకార్యములు జరిగించుచు, నీ శా స్త్రానుసారముగనే ప్రవర్తించుచున్నామనుట సర్వాబద్ధము. ఏరాష్ట్ర మేవిధముగ చెప్పుకొనుచున్నను, రాష్ట్రము లన్నియు బాహుబలమే సత్వమున కాధారమను నీతి సూత్రము నవలంబించుచున్నవి. చిన్నరాష్ట్రములు, "అత్యు చ్ఛ్రియఃపతన హేతు''వను నీతిని నమ్ముకొని కాలము గడుపు కొనుచున్నవి.

యూరపుఖండ రాజ్యములలో ముఖ్యమైనవి ఒక కమిటీగ నేర్పడి ఒక నిబంధనను చేసినచో, ఆకమిటీలో మెంబర్లు కానివారుకూడ దాని నంగీకరించు నాచారము గత శతాబ్దమునుండి యేర్పడినది. అమెరికా ఖండములో

నంయుక్తరాష్ట్రి ప్రభుత్వమువారు అక్కడి చిన్న రాష్ట్రిముల మీాద నిట్టియధికారము తమకు కలదని చెప్పుకొనుచున్నారు. ఈవిషయములను గురించి దేశచరిత్రలనుండి కొన్ని యుదాహరణల నిచ్చెదము. 1832 వ సంవత్సరములో గ్రీసు రాజ్యస్థాపన విషయమై యూరపుఖండములోనుండు పెద్దరాష్ట్రిములలో చాలకాలము మంత్రాలోచనలు జరిగి, తుదకు టర్కీవారినుండి గ్రీసు దేశమును విడగొట్టి, యింగ్లాండు, ఫ్రాన్సు రష్యారాష్ట్రిములు, గ్రీసుదేశ స్వాతంత్ర్యతకు తాము జవాబుదారీగా నుండుట కేర్పరుచుకొనిరి. ఈవిషయమై ఆస్ట్రియా వారికిని, ప్రష్యావారికిని యెప్పటిసంగతి అప్పుడు తెలుపుచునే యుండిరి. 1865 వ సంవత్సరంలో గ్రీసుదేశపురాజు, స్థానభ్రష్టుడుకాగా వీరందరుకలసి ఆదేశమునకు వేరొకరాజు నేర్పరచిరి. ఈవిధముగనే అయోనియన్ దీవులను గ్రీసుతో కలపిరి. 1876 వ సంవత్సరము మొదలు 1881 వ సంవత్సరము వరకు కార్య సంధానములుచేసి, టర్కీవారిచేత కొంతదేశమును గ్రీసువారి కిప్పించిరి. 1886 వ సంవత్సరములో గ్రీసువారు టర్కీవారివలన తమకింకను కొంతదేశము రావలెనని వీరితో యుద్ధముచేయుటకు ప్రయత్నించగా యీపెద్దరాష్ట్రిములు గ్రీసును ఒత్తిడిచేసి, దాని యుద్యమమును మానిపించెను. హాలెండువారిమీాద దాసి పౌరులైన బెల్జియనులు 1830 వ సంవత్సరములో తిరుగబడినపుడు వీరుభయులు నీ పెద్ద రాష్ట్రిములను మధ్యవర్తులుగ కోరుకొనగా, నివి హాలెండు

వా రెంత మొఱపెట్టుకొన్నను వినక బెల్జియమును వేఱుగ నొక రాష్ట్రముగ నేర్పరచి దీని తటస్థతకు తామన్నియు జవాబుదారులైనవి. ఈ వ్యవహారమును కుదుర్చుటలో నీ పెద్దరాష్ట్రములకు తకరారు జరిగి తుదకు 1839 వ సంవత్సరములో బెల్జియము రాజ్యము స్థాపింప బడినది. అంతవరకు ఆంగ్లేయులు హాలెండు దేశమును తమ నావలతో ముట్టడించియుండిరి. ఫ్రాన్సువారు ఆంటువర్పు కోటను ముట్టడించి స్వాధీనము చేసికొనిరి.

ఈజిప్టు దేశము టర్కీరాజ్యములో మొదటినుండియు చేరియున్నను 1840 వ సంవత్సరములో దీనిని వేరుగ నొక రాష్ట్రముచేసి, టర్కీ సుల్తాను చేత 1841 వ సంవత్సరములో ఈ పెద్ద రాష్ట్రములన్నియు, అప్పటి గవర్నరుగారైన మహమ్మదాలీగారిని వంశ పారంపర్యపు హక్కులతో రాజుగా నియమింపబడుసట్లు చేసిరి. దీనికి మొదట ఫ్రాన్సువారు ఒప్పుకొనలేదు గాని తుదకు వారును తక్కిన పెద్దరాష్ట్రముల వారితో నేకీభవించిరి. పేరునకు మాత్రము టర్కీసుల్తానుగారి క్రింద సామంతరాజ్యముగ నుండెను గాని యీ దేశవ్యవహారములు మొదటనుండియు ఫ్రాన్సువారును, యింగ్లీషువారును జరపుచుండిరి. 1882 వ సంవత్సరములో ఫ్రాన్సువారు తొలగిరి. ఆసంవత్సరములోనే, యీజిప్టురాజుగారిమీద (ఖైడైవు) అనాబీపాషా పితూరీ జరిగించినపుడు, యింగ్లీషువారు ఆ తిరుగుబాటును అణచివేసి, అప్పటినుండియు తమ సేనను స్థిరముగ

నుంచి ఖెడైవుగారికి సలహాకారులుగ నున్నారు. 1898 వ సంవత్సరములో వీరి సేనయు ఖెడైవుగారి సేనయు, అదివరకు తమ స్వాధీనములోనుండి తప్పిన సౌడాను దేశమును తిరిగి జయించి యీజిప్టులో కలిపిరి. సేనాధిపతియైన కిచనరుగారిని సౌడాను దేశమునకు గవర్నరుగ నియమించిరి. ఈజిప్టుదేశములో నెమ్మది కలుగగనే, అనగా రాజ్యపరిపాలన తృప్తికరమైన స్థితియందుంచగనే వెళ్లిపోయెదమని ఆంగ్లేయులు వాగ్దానము చేసియున్నారుగాని యింతవరకు వారీదేశమును విడువలేదు. ఇంకను దేశములో నెమ్మదికి తమ జవాబుదారీ వృద్ధియగుచున్నది గాని తగ్గుటలేదని చెప్పుచున్నారు. వీరులేచి పోవునప్పుడు పెద్దరాష్ట్రముల కమిటీవారికి యీ దేశమును ఒప్పజెప్పవలెననియు, ఆ కమిటీవారు నియమించుకొన్న ప్రకారము యీ దేశపరిపాలన జరుగవలయుననియు, గ్లాడుస్టను మొదలగు రాజ్యతంత్రజ్ఞుల యభిప్రాయమై యున్నది. ఇప్పుడు తిరిగి యీజిప్టు తన పరిపూర్ణ స్వాతంత్ర్యమునకు యింగ్లాండుతో సంధిచేసుకొనుటకు ప్రియత్నించుచున్నది. 1856 వ సంవత్సరములో టర్కీవారు క్రీస్తుమత పౌరులను బాధపెట్టుచున్నారనే మిషమీాద రష్యావారు ఆదేశపరిపాలనలో జోక్యము కలుగజేసికొనుచున్నారని ఫ్రాన్సువారును, యింగ్లీషువారును రష్యాతోపోరాడి టర్కీవారి పరిపాలనను గురించి పైతణిఖీ చేయుటకే పెద్దరాష్ట్రములన్నియు పారీసు నగరములో సంధిచేసికొన్నవి. ప్రష్యారాష్ట్రము, ఆస్ట్రియారాష్ట్రము

కూడ పెద్దరాష్ట్రములలో చేరినవి గనుక, వీనినికూడ యీ మంత్రాలోచనలో చేర్చుకొన్నవి. 1878 వ సంవత్సరములో సదరు పారీసుసంధినిబట్టి రష్యావారు టర్కీవారితో వేరుగ మరియొక సంధిని చేసికొనగూడదని తక్కిన పెద్దరాష్ట్రములు స్పష్టముగ జెప్పినవి. తరువాత నీ పెద్దరాష్ట్రము లన్నియు బెర్లినులోకూడి యేదియో యొక విధమైన సమాధానమునకు వచ్చినవి. డాన్యూబు నదీముఖద్వారమున దుర్గములు కట్టి బలపరిచినవి. టర్కీని నాగరికరాష్ట్రములలో నొకదానిగ చేర్చుకొన్నవి. ఇటలీని పెద్దరాష్ట్రములలోనికి తెచ్చుకొన్నవి. లగ్జంబర్గును తటస్థరాజ్యముగ చేసినవి. మాంటినీగ్రో, రొమేనియా, సెర్వియా మొదలగు టర్కీవారిపరగణాలకు స్వాతంత్ర్యము కలుగజేసినవి. సూయజుకాలువ తటస్థప్రదేశముగ నుండునటుల సముద్రతీరములుగల రాజ్యములవారి నందరిని 1888 వ సంవత్సరములో ఒప్పించినవి. ఈ కార్యములనుబట్టి యీ గొప్ప రాజ్యములు (Great Powers) పలుకుబడిలోనేగాక న్యాయశాస్త్రకర్తృత్వములోకూడ ఆధిక్యత సంపాదించినవి. ఈ రాష్ట్రకమిటీవారు యుద్ధమునకు బయలుదేరెదమని జడిపించిగాని, యుద్ధము చేసిగాని లేక సలహామూలమునగాని, తక్కిన రాజ్యములను తమ మాటను వినునట్లు చేసెదరు. వీరు మంచిచేసినను, చెఱుపు చేసినను తక్కిన చిన్నరాష్ట్రములామోదించవలసినదే. బలవంతుడే రాజుగాన వీరు మంద

లించి చిన్నరాష్ట్రము లొండొంటితో పోరకుండ నాపివేయ గలరు. ఈ పెద్దరాష్ట్రములమధ్యనే తగాయిదాలు సంభవించి నపుడు, వీరికి నీతి చెప్పువా రెవరుందురు ? 1914-1918 జరి గిన యుద్ధములో అమెరికావారుతప్ప యీ ప్రపంచములో వీరిని మందలించి మంచి సలహా నిచ్చువారు లేకపోయిరి. అమెరికావారి మాటలనుకూడ పెడచెవిని పెట్టుటకు సిద్ధముగ నుండిరి. చిన్న రాజ్యములనుసయితము యిరుకక్షులవారు తమ సహాయమునకు యుద్ధములోనికి లాగిరి. ఈ గొప్పరాష్ట్రి ముల కమిటీకూడ వీనిలో కొన్ని అప్పుడప్పుడు తమలో తా మేర్పరుచుకొన్న స్నేహసంబంధములవలెనే గాలికి యెగరగొట్టబడునని తోచుచున్నది.

అమెరికా ఖండములో సంయుక్తరాష్ట్రమువారే మిక్కిలి బలవంతులు. వీరి ముందర తక్కిన రాష్ట్రములవారు అణుమాత్రులు. కాబట్టి యూరపుఖండములో పెద్దరాష్ట్రి ములకమిటీవారు చేయుటకు ప్రయత్నించు పనులను, యీ సంయుక్తరాష్ట్రమువారు తమ అమెరికాఖండములో, శీఘ్ర ముగను సులభముగను చేయగలుగుదురుకాని వీరు మిక్కిలి స్వాతంత్ర్యాభిమానము గలవారగుటచేత చిన్నరాష్ట్రముల జోలికి పోరు. ఈ చిన్నరాష్ట్రము లొండొంటితో నెంతగ పోరుచున్నను వీ రెంతమాత్రము జోక్యము కలుగజేసి కొనరు. కాని, యూరపుఖండవాసులు అమెరికాఖండమునకు వచ్చి యే రాష్ట్రమునైనను ఆక్రమించదలచుకొన్నను, లేక

దానితో జగడము చేయదలచుకొన్నను, యీ సంయుక్త రాష్ట్రమువారు ఆ చిన్న రాష్ట్రముల తరఫున యుద్ధమునకు దిగి తీరుదుమని 1823 వ సంవత్సరములో, వాని ప్రెసిడెంటు గారగు మన్రోగారు కంఠోక్తిగ ప్రకటించినారు. ఈ చిన్న రాష్ట్రములను కాపాడుటకు తాము జవాబుదారీ స్పష్టముగ వహించకపోయినను, మన్రోగారి నీతిసూత్రము నిటీవల అనేకవిషయములలో నవలంబించిరి. అమెరికా ఖండములో నుండు రాజ్యములలో నెల్ల ప్రజాస్వాతంత్ర్యమే (Democracy) యుండునట్లును, యూరపుఖండ రాజ్యాంగతంత్రములు స్థాపించబడ కుండునట్లును, సంయుక్తరాష్ట్రపాలకు లెల్లపుడు ప్రయత్నించుచుందురు. తమరందరికంటె ముందుగా స్వాతంత్ర్యము సంపాదించుకొనుట చేతను, తమ రాజ్యస్థాపనలు స్థిరమైన వగుటచేతను, తమ ప్రజలకు న్యాయవిధియందు గౌరవము కలిగియుండుటచేతను, తమకు సాధనోపాయము లెక్కుడుగ నుండుటచేతను, తమకు నావికాబలము మెండుగ నుండుటచేతను, తమరు వాణిజ్యములో సాహసబుద్ధికలవారగుటచేతను, యూరపుఖండమునుండి వచ్చెడు వివిధ దేశముల వారికి తాము శరణమొసంగ గలరు గనుకను, తమ దేశములో నుండు గొప్పయుత్పత్తి స్థానములను పెంపుచేసి, తమ దేశస్థుల ఐశ్వర్యమును వృద్ధిచేయుటచేతను, తమ ప్రజల పరాక్రమము, బుద్ధి కుశలత మిక్కిలి అభివృద్ధి పొందుచుండుట చేతను, ఈ సంయుక్తరాష్ట్రమువారు అమెరికాఖండము

నకు నిజమైన యజమానులని చెప్పుట కెంతమాత్రము సందేహము లేదు.

---

## అధ్యాయము V.

---

### రాష్ట్రిమంత్రాంగముతో సంబధించిన హక్కులు, విధులు.

### (Rights and Duties in regard to Diplomacy.)

అన్యోన్యసంసర్గము లేనియెడల, రాష్ట్రిముల వ్యవహారములు సరిగా జరుగనేరవు. ప్రతిదేశము, తానెంత అనాగరికతలో నున్నను, యితరదేశములకు రాయబారులను పంపుచుండును. నాగరికరాజ్యములలో వీరు లేనియెడల పరదేశములతో నే విధమైన వ్యవహారములును జరుగనేరవు గనుక, ప్రతిరాష్ట్రిము, తనరాయబారులను పంపుహక్కును, విదేశీయ రాయబారుల కాతిథ్యమీయవలసిన విధియు కలిగియున్నది. సంపూర్ణస్వాతంత్ర్యములు లేని రాజ్యములకు కూడ, నీ హక్కు కొంతవరకు గలదు. ఈజిప్టుదేశపు ఖడైవుగారికి టర్కీసుల్తానుగారు 1866, 1867 వ సంవత్సరములలో నిచ్చిన ఫర్మానాలను బట్టి, విదేశీయులతో వాణిజ్యము, పోస్టు, టెలిగ్రాపు మొదలగు విషయములలో విదేశీయులతో ఒడంబడికలు చేసికొనవచ్చునుగాని రాజకీయవిషయములలో పరదేశీయులతో ఖడైవుగా రెట్టి సంబంధమును పెట్టుకొన

కూడదు. తక్కిన వ్యవహారములలో కూడ, టర్కీసుల్తాను గారికి తెలియపరచిన పిమ్మట సదరు ఒడంబడికలను ప్రచుర పరచుచుండవలెను. ఈ విధానమిప్పుడు మారిపోయినది. ఈజిప్టు, సంపూర్ణ స్వరాజ్యము ననుభవించుచు, టర్కీతో నెట్టి సంబంధమును లేకుండ జేసికొనెను. ఇట్లే, యూరపుఖండ మంతయు, సంపూర్ణస్వాతంత్ర్యరాష్ట్రములుగ విడిపోయి, ప్రజా ప్రభుత్వములనే నెలకొల్పుకొన్నవి. ఇటలీ, స్పెయిన్, హాలెండు, బెల్జియము మొదలగు చిన్నదేశములను మాత్రము యింగ్లాండులోవలెనే, పార్లమెంటుకు లోబడి రాజులు పాలించుచున్నారు.

ఏ రాష్ట్రముగాని విదేశరాయబారుల కాతిథ్య మీయనియెడల, నాగరిక రాష్ట్రకుటుంబములోనుండి తొలగింపబడును. అట్లేనాగరికరాష్ట్రము చేయలేదు. ఒకానొకపుడు ఒకరాష్ట్రము మరియొకరాష్ట్రముతో మంత్రాంగ సాంగత్యమును కొంతకాలమువరకు వదులుకొనవచ్చును. అట్లుచేసిన యెడల, రెండవదానిని తిరస్కరించునటు లెంచబడును. రెండు రాష్ట్రములు యుద్ధములో దిగకముం దెవరిరాయబారులను వారు తమదేశమునకు పిలిపించుకొందురు. తన రాయబారులను పరదేశమునుండి పిలిపించుట, తనదేశములోనున్న దాని రాయబారులను పంపివేయుట, పరదేశముమీద అయిష్టమును జూపుచర్యలలో నొకటి. ఇంతమాత్రముచేత నీ రెండురాష్ట్రములు సాధారణముగ యుద్ధములోనికి దిగవు.

ఒక మనిషిమీద ప్రత్యేకముగ విదేశీయప్రభుత్వము వారి కయిష్టము కలిగినపుడు అతనిని రాయబారిగ నా దేశమునకు పంపకూడదు. పదునేడవశతాబ్దములో, నింగ్లీషు వారు తమరాయబారిని ఫ్రాన్సుకు పంపగా, అతడదివరకు ఫ్రాన్సుకువచ్చినపుడు తాను ఫ్రెంచిరాణీగారిని మోహించితినని చెప్పుటవలన, ఫ్రెంచిగవర్నమెంటువారు, ఆ రాయబారిని పంపకూడదని యింగ్లాండువారికి తెలియజేసిరి. తగిన కారణములు లేవని విదేశము వారభిప్రాయపడిన యెడల తమరు పంపిన రాయబారిని వెనుకకు పిలుపించరు. ఏ రాయబారిగాని, తాను వెళ్లబోవు దేశజనుల మీదగాని, వారిరాజ్యాంగతంత్రము మీదగాని, అయిష్టము కనుపరచినయెడల వారిని తమదేశమునకు రాయబారిగ పంపవద్దని చెప్పవచ్చును. ఈ రాయబారి తాను నియమింపబడిన దేశమునకు పౌరుడుగానుండుట తటస్థించినయెడల, రాయబారి కుండవలసినహక్కులు పోనేరవు. ఈ కారణముచేత తమపౌరులు తమదేశములో విదేశప్రభువుల తరఫున రాయబారులుగ నుండుట కేరాష్ట్రములును సాధారణముగా ఒప్పుకొనవు.

ఒకప్పుడు విదేశరాయబారి తాను వచ్చినదేశములో అక్రమములు జరిగించినపుడు, ఆయనను తక్షణము రప్పించుకొనవలసినదని ఆ విదేశరాష్ట్రాధికారులకు వ్రాయవచ్చును. తగిన హేతువు లున్నయెడల, నా రాయనను తమ దేశమునకు తిరిగి రమ్మనుమని ఆజ్ఞాపించవచ్చును. అట్టి

కారణములు లేవనుకొన్న యెడల వారిని పిలిపించకపోయినను, ఈయనగుండా వ్యవహారములు జరుగవు గనుక, మరియొక చిన్నయుద్యోగస్థుని పంపి కావలసిన పనులను నెరవేర్చు కొనుచుండును. ఈ రాయబారులు తమ దేశప్రభువులు తమ కిచ్చిన యధికారములను తెలియజేయు కాకితములను విదేశ ప్రభువులకు కనుపరచినతరువాత, వారివలన అతిథిసత్కారము లను పొందినదినమునుండి వీరికి కొన్ని హక్కు లేర్ప డును. రాజులచేత పరిపాలింపబడు దేశములనుండివచ్చిన రాయబారులు తమ రాజులు చనిపోవగనే తమరు క్రొత్త రాజుచేత తిరిగి నియమింపబడేవరకు, తమకు రాయబారి యుద్యోగము లేనట్టుగనే యెంచుకొనవలయును.

ఈ రాయబారులుగాక, విదేశములలోనున్న తమ వర్తకులకును నావికులకును సహాయము చేయుటకు అక్కడ తమ యేజేంట్లను (Consuls) కొన్ని రాష్ట్రము లుంచుకొను చుండును. వీరికి రాయబారత్వము లేదు. వీరు రాజకీయ విషయములలో జోక్యము కలుగఁజేసికొనరు. తమ దేశము యొక్క వాణిజ్యాభివృద్ధికై పనిచేయుచుందురు. వీరుకూడ వాణిజ్యము చేసికొనవచ్చును. వీరు విదేశపౌరులుగ నుండినను యెట్టి అభ్యంతరము లేదు. మహమ్మదీయరాజ్యములలో నిట్టి యేజంట్లకు రాయబారుల కుండు హక్కులు కొన్ని కలవు. వీరు విదేశములో తమ దేశపౌరులమీఁద న్యాయాధి కారము చెలాయించెదరు. అక్కడ తొందరలు కలిగినపుడు,

తమ దేశస్థులును, యితర దేశీయులును, వీరి గృహముల యందు దాగవచ్చును. సాధారణముగా నీ యేజెంటులు వాణిజ్యవ్యవహారములకే యేర్పడెదరుగాన, తమరున్న దేశములోనుండు న్యాయస్థానములకు లోబడియుండవలెను. వీరి గృహములలోనికి, ఆ దేశములోనుండు ఉద్యోగస్థులు చొరబడి నేరస్థులను పట్టుకొనవచ్చును.

విదేశీయరాయబారులు తమ విధాయకకృత్యములను నిర్భయముగ నెరవేర్చవలెనన్న, తమ రున్న దేశపు కోర్టులకు లోబడకూడదు. వీరి కుటుంబము, మతగురువు, సెక్రిటరీ, నౌఖరులు మొదలగు పరివారముల కీ రాయబారులకు గల హక్కులన్నియు కలవు. వీ రందరు ఆ దేశపు శివిలు క్రిమినలు అధికారములకు లోబడరు. వీరికి గలుగు పిల్లలు, వీరి స్వదేశపౌరులే యగుచున్నారు. వీరు తమ రున్న విదేశ సురక్షితకు భంగము కలుగునటుల కుట్ర చేసినయెడల, వీరిని గురించి వీరి ప్రభువులకు తెలియపరచవలెనుగాని, బలాత్కారముగ ఆ దేశ ప్రభువులు వెడలగొట్టకూడదు. మిక్కిలి అవసరమైనప్పుడు అట్లు తెలియజేయకుండగనే వీరిని పంపివేయవచ్చును. వీరిని విచారించి శిక్షించుటకు విదేశప్రభువుల కధికారము లేదు. వీరిని చూడవచ్చినవారికి యీ హక్కులు లేవు. ఈ రాయబారులమీాద కోర్టులు సమ్మనులు జారీ చేయకూడదు. వీరి కిష్టమున్నయెడల కోర్టులకు పోయి సాక్ష్యము చెప్పవచ్చును. తమ యింటివద్దనే సాక్ష్యము

యిచ్చెదనని వీరు కోరవచ్చును. రాజకీయవ్యవహారములలో
కొన్ని రహస్యముగ నుంచవలయునని వీరికి తోచినయెడల,
వానినిగురించి సాక్ష్య మిచ్చుటకు నిరాకరించవచ్చును. ఒక
రాయబారి తన పరివారములో నేరము జరిగినపుడు తాను
విచారణ చేసి శిక్షించకూడదు. సాక్ష్యము పూర్తిచేసి నేరస్థు
లను తన దేశమునకు పంపవచ్చును. శివిలువ్యవహారములలో
నైనను, తన పరివారములోనివారు వ్రాసికొను ఉయిల్లు,
కంట్రాక్టులు మొదలగు దస్తావేజులమీాద సాక్షి వ్రాలును
మాత్రము చేయవచ్చును. తన మతగురువు తన దేశీయుల
మధ్య పెండ్లిండ్లు జరిగించవచ్చును. ఈయన విదేశీయులను
తన దేశస్థులకును, విదేశీయులమధ్యను, పెండ్లిండ్లు జరిగించ
వచ్చునా యను విషయమునుగురించి భేదాభిప్రాయము
లున్నవి.

రాయబారులు, తాము పోవలసిన దేశమును చేరు
టకు మరికొన్ని యితర దేశములగుండ ప్రయాణము చేయ
వలసివచ్చినపుడు, ఆయా దేశములవారు, వీరికి గల హక్కు
లకు భంగము చేయకూడదు. వీరికి కావలసిన సౌకర్యముల
నొనగూర్పవలెను. యుద్ధతులు, ఒకరి రాయబారిని రెండవ
వారు పట్టుకొనవచ్చును. తటస్థరాజ్యములలో వీరిని అట్లు
పట్టుకొనకూడదు. ఈ రాయబారుల నౌకరులు, రాయబారు
లున్న బసలలోగాక బయట నేరము చేసినయెడల వీరిని.
అరెస్టుచేయవచ్చునని యింగ్లాండువా రభిప్రాయపడుచున్నారు.

కాని మరికొన్ని దేశములలో రాయబారుల యనుమతి లేనిదే వీరిని పట్టుకొనగూడదని చెప్పెదరు. శివిలు కేజులలో వీరిని కోర్టుల యెదుటకు తీసికొనిపోవుటకు రాయబారులు తమ యంగీకారము నిచ్చుచునే యుందురు. ఈ నౌఖరులు నేరములుచేసినపుడు రాయబారి వీరిని తీసివేయగనే, వీరి విశేష హక్కులు పోవుటవలన ఆ దేశపు కోర్టులు పట్టుకొనవచ్చును. లేక రాయబారి వీరిని కోర్టులకు తానే ఒప్పజెప్పవచ్చును. వీరు గొప్ప నేరములను రాయబారి బసలోనే జరిగించిన యెడల వీరి దేశమునకు విచారణనిమిత్తము పంపివేయు చుందురు.



## PART II

## రెండవ భాగము



### యుద్ధసమయ నియమములు

### LAWS OF WAR

# అ ధ్యా య ము I

(Semi peaceful relations before Declaration of War)

యుద్ధారంభ ప్రయత్నములు

రెండు రాష్ట్రములు యుద్ధమునకు దిగకముందు, నెమ్మదికి భంగములేకుండ, ఒండొంటిమీద అయిష్టమును కనపరచు పనులను జరిగించుచుండును. ఈ పనులను బట్టి, యుద్ధము సంప్రాప్తము కావచ్చును. లేదా ఒకటి రెండవదానికి పరిహారము నొసంగి సంధిచేసికొనవచ్చును. ఈ పనులు మూడుతరగతులుగ విభాగించవచ్చును:—

(1) ప్రత్యపకారము (Reprisals)

(2) రేవులయొద్ద యాటంకము (Embargo)

(3) శాంతికరమైన ముట్టడి (Pacific blockade)

ప్రత్యపకారము—ఒక రాష్ట్రము మరియొక రాష్ట్రము నెడల విరోధభావమవలంబించి ఒక పనిచేసిన యెడల రెండవదికూడ నట్లే చేయవచ్చును. ఒక రాష్ట్రమునుండి వచ్చు సరకులమీద మరియొక రాష్ట్రము సుంకములు వేసినయెడల నీ రెండవదాని సరకులమీద మొదటిరాష్ట్రము కూడ నటులనే సుంకములు వేయవచ్చును. ఇట్టిపనులు (Retortions) సాధారణముగా విరోధమును సూచించవు. ఒకరాష్ట్రము, తనకు మరియొక రాష్ట్రము అపకారము కలుగజేసినదని తలచి

నపుడు, తనసైన్యమును ఆ రెండవరాష్ట్రములోనున్న సొత్తును పట్టుకొని పాడుచేయుటకు పంపవచ్చును. ఇదియే నిర్బంధ ప్రతీకారమని (Reprisal) చెప్పబడును. 1884, 1885 వ సంవత్సరములలో చీనా దేశమునుండి ఫ్రెంచి కొచ్చెను చైనా దేశములోనికి అనేకులు గుంపులుగా వచ్చి ఫ్రెంచివారిమీద తిరుగబాటుచేయు ప్రజలతో కలసి పోరజొచ్చిరి. ఫ్రెంచి వారు చీనా దేశప్రభువుల కెన్నిసారులు ఈ విషయమై తెలి యజేసినను, వారు పెడచెవిని బెట్టుటచేత, ఫ్రెంచి నావికా సైన్యము చీనావారి ఓడరేవులను ముట్టడించినది. కాని, ఫ్రెంచివారు, చీనావారితో యుద్ధముచేయుట కిష్టపడలేదు. మంత్రాంగము, మామూలుగ నుభయరాష్ట్రములకు జరుగు చునే యుండెను. తుదకు చీనావారును, ఫ్రెంచివారును ఉభ యులకు కావలసిన యేర్పాటులు చేసికొనిరి.

రేవులయొద్ద యాటంకము—కోపము కలిగించిన రాష్ట్రములయొక్క వర్తకపుటోడలు తన రేవులలో నున్న యెడల, వానిని పోనీయకుండ మరియొక రాష్ట్రము చేయ వచ్చును. నడిసముద్రములో గాని, కోపము కలిగించినరాష్ట్ర ముయొక్క రేవులలోగాని ఓడలను పట్టుకొన్నయెడల, నిట్టి పనులు మొదటితరగతియైన ప్రత్యపకారము క్రిందకువచ్చును. నిజముగా యుద్ధమునకు దిగదలచు కొన్నపుడు, విరోధిరాష్ట్ర నావలు తమరేవులలో నున్నయెడల, అవి వెడలిపోవుటకు కొంత వ్యవధిని యిచ్చుచుండుట ఆచారమై యున్నది.

శాంతికరమైన ముట్టడి—ఈకార్యసాధనము మొదట 1827 వ సంవత్సరములో ప్రయోగింపబడినది. అప్పుడు బ్రిటిషు, ఫ్రెంచి, రష్యావారలు, టర్కీరాజ్యమునకును, దాని గ్రీకు పౌరులకును జగడములు సంభవించగా, తమ్మును మధ్యవర్తులనుగా నుంచుకొనుటకు టర్కీరాజ్యమును బలాత్కారముగ నొడబరచుటకు, దాని రేవులను ముట్టడించిరి. తటస్థరాజ్యముల వారి ఓడలను ఆపకుండ, టర్కీవారి యోడలకు రాకపోకలు లేకుండ జేసిరి. 1886 వ సంవత్సరములో ఫ్రాన్సుతప్ప, తక్కిన గొప్పరాష్ట్రములు గ్రీసువారిని టర్కీవారితో యుద్ధముచేయకుండ గ్రీసు దేశమును ముట్టడించినవి. గ్రీకు నావలను బయటకు పోనీయలేదు. బయటి వానిని రానీయలేదు. విదేశీయనావలను మాత్రము గ్రీసుదేశమునకు పోనిచ్చినవి. ముట్టడి ప్రకటించకముందు, గ్రీకుఓడ లితరరాష్ట్రముల వారి సరకులను తీసికొని వచ్చుచుండిన యెడల, వానిని గ్రీసు దేశమునకు పోనిచ్చినవి.

యుద్ధమునకు దిగకముందు, విరోధరాష్ట్రములకును తటస్థ రాష్ట్రములకును యుద్ధప్రకటన చేయవలయునా యను విషయమును గురించి శాస్త్రజ్ఞులలో భిన్నాభిప్రాయము లున్నను, ఆచరణలో నట్టి ప్రకటనలు లేకనే యుద్ధములు మొదలుపెట్టబడుచున్నవి. పందొమ్మిదవ శతాబ్దములో నిట్టి ప్రకటనలు లేకుండ సుమారు అరువదియుద్ధములు ప్రారంభించబడినవి. 1870 వ సంవత్సరములో ఫ్రాన్సు

జర్మనీ దేశములకును, 1877 వ సంవత్సరములో రష్యా టర్కీ దేశములకును, యుద్ధములు జరిగినపుడు ముందుగా నోటీసు లీయబడినవి. అకారణముగ యుద్ధ మెప్పుడును పొసగదు. మొదట కొంతకాలము కార్యసంధానములో గడపి, తగిన పరిహారము చేకూరనపుడు నిష్కర్షమైన కడపటితీర్పును (Ultimatum) యుద్ధతులు పంపుకొనుచుందురు. యూరపుఖండములో ఘోరసంగ్రామము 1912 కు పూర్వమే సంప్రాప్తమగునని యుద్ధతులకు నిశ్చయముగా తెలిసియున్నను, యిట్టి కడపటి నిశ్చయాభిప్రాయమును జర్మనీవారు రష్యాకును, ఫ్రాన్సునకును, యింగ్లాండునకును తెలియజేసియున్నారు. సేనలను యుద్ధసన్నాహమునకు సంసిద్ధము చేయుట యీ కాలములో దాగదుగనుక, ముందుగా యుద్ధమును ప్రకటించనవసరము లేదు.

ప్రతిరాష్ట్రము, తాను యుద్ధములో దిగుటకు నిశ్చయించుకొన్నపుడు, యుద్ధతుల కుండవలసిన సమస్తహక్కులును, విధులును కలిగియుండును. ఏ రాష్ట్రములోగాని, ఒక దేశవిభాగములోని సంఘము తమ రాజుమీద డీకొనినపుడు, దానిని యుద్ధతునిగా భావించి (Recognition of belligerency) దానికి యుద్ధతుల హక్కులు, విధులు, యితర రాజ్యములవారు కలిగించవచ్చునాయను విషయము మిగుల ముఖ్యమైనది. అది, తన ప్రభుత్వముమీద తిరుగుబాటు చేసినపుడు, ఆ ప్రభుత్వమువారు దానిని యుద్ధతునిగా భావిం

చుటఅసంభవము. ఆ దేశవిభాగమునకు సంపూర్ణస్వాతంత్ర్యము సంపాదించవలెనని గాని, లేక రాజ్యతంత్రములో గొప్పమార్పులు చేయవలెననిగాని, అక్కడి ప్రజలు తిరుగబాటుచేయుచుందురు. అదివరకు అమలులోనున్న శాసనములను బట్టి వీరు రాజద్రోహ నేరముక్రింద ఉరిదీయబడవచ్చును. లేక దేశమునుండి వెడలగొట్టబడవచ్చును, లేక కఠినశిక్షలకు లోనుగావలసివచ్చును. అయినను, వీరు గొప్పసంఘముగ నేర్పడి తగిన సేనలను, సేనాధిపతులను సేకరించుకొని, యుద్ధనియమముల ననుసరించి పోరుచున్నపుడు వీరికి యుద్ధతుల హక్కులు విధులు కలిగియుండుట న్యాయమే. వీరి ప్రభువులు యెన్నటికిని వీరిని యుద్ధతులుగ నొప్పుకొనక పోయినను, తటస్థరాజ్యములు తమ సంరక్షణకొఱకు వీరిని యుద్ధతులని ఒప్పుకొనవలసివచ్చును.

అమెరికా సంయుక్తరాష్ట్రములలో 1864 వ సంవత్సరమందు అంతఃకలహము సంప్రాప్తమైనది. వానిలో దక్షిణరాష్ట్రములకును, ఉత్తరరాష్ట్రములకును బానిసత్వస్థాపనను గుఱించి భేదాభిప్రాయములు కలిగి, తమకిష్టము వచ్చినపుడు సంయుక్తరాష్ట్ర రాజ్యాంగతంత్రమునుండి విడిపోవుటకు హక్కు కలిగియున్నదని దక్షిణరాష్ట్రముల వాదనను ఒప్పుకొనకపోవుటచేత, ఉభయులకు గొప్పయుద్ధము జరిగినది. అప్పుడు సంయుక్తరాష్ట్రపు హైకోర్టువారు, ఒక కేజులో, యీ దక్షిణరాష్ట్రముల వారిని యుద్ధతులును, రాజద్రోహులును

కూడ యగుదురని తీర్మానించిరి. కాని యుద్ధము జరిగినంత కాలము సంయుక్తరాష్ట్ర ప్రభువులమని చెప్పుకొనుచుండిన ఉత్తరరాష్ట్రముల వారు, తిరుగుబాటుచేసిన దక్షిణరాష్ట్రముల వారిని యుద్ధతులుగానే భావించిరి.

ఇటుల తమప్రభువుల మీద తిరుగబడిన సంఘములను, తటస్థముగ నున్న యితరరాజ్యములు, యుద్ధతులని యంగీకరించవచ్చును. ఈ యంగీకారమును (Recognition of belligerency) వ్రాతమూలమునగాని, లేక తమ చేష్టల వలనగాని తెలుపుచుండును. ఇంతమాత్రముచేత అట్టిసంఘములు సంపూర్ణస్వాతంత్ర్యములు కలవియని ఒప్పుకొనినటు లెంచగూడదు. యుద్ధసమయములలో స్వతంత్రరాజ్యముల కెట్టిహక్కులు, విధులుకలవో, యీ సంఘములకును అట్టిహక్కులు విధులు కలవని తటస్థరాజ్యములు ఒప్పుకొనినటుల యెంచబడును. ఈ లాగు ఒప్పుకొనుటచేత, నీ తటస్థరాజ్యముల వర్తకనావలను, యుద్ధతులు పట్టుకొని సోదాచేసి, న్యాయశాస్త్రప్రకారము వానినిగాని, వానిలోని సరకులను గాని బలాత్కారముగ స్వాధీనము చేసికొనవచ్చును. యుద్ధతులుభయులు జరిగించు నావికాయుద్ధములను, తటస్థరాజ్యములు లక్ష్యపెట్టుచుండవలయును. ప్రభుత్వము మీద తిరుగబడిన సంఘముయొక్క సైన్యమును, సేనాధిపతులను న్యాయముగ పోరుచున్న యోధులలాగున గౌరవించవలయును.

తటస్థరాజ్యములుగాని, ఆ దేశపురాజులుగాని, యిచ్చినట్టి యీ యుద్ధతాంగీకారము ననుసరించి అనేక న్యాయశాస్త్రసంబంధమైన ఫలములు కలుగును కాబట్టి, తిరుగుబాటు చేయు సంఘములను, వారిప్రభుత్వము వారికి కోపము రాకుండ యుద్ధతులనుగ నెట్టి సమయములలో తటస్థరాజ్యము లంగీకరించవచ్చునో తెలిసికొనవలయును. ముఖ్యముగా రెండునియమములున్న యెడల, అట్టి అంగీకారము నీయవచ్చును. (1) మనము సాధారణముగా వాడుకొనుచుండు నర్థములో యీ తిరుగబాటును యుద్ధముగ పరిగణింపవలెను. (2) అంగీకారమునీయకపోయినయెడల తటస్థరాజ్యమునకు నష్టము వాటిల్లవలెను. తిరుగుబాటు చేసినసంఘము, ఒక నిర్దిష్టమైన ప్రదేశము నుంచుకొని ఒక రాజ్యాంగతంత్రము నేర్పరుచుకొని, సేనలు సమకూర్చుకొని, యుద్ధధర్మముల ప్రకారము నడచుకొనవలయును. యుద్ధతులని అంగీకరించు రాష్ట్రప్రజలకును, యుద్ధములో జరుగుపనులకును, ఒక్కిలి సంబంధ ముండవలయును. ఒక దేశములో రాజునకును, ప్రజలకును జగడము సంభవించినపుడు, ఆ దేశమునకు దూరముగనుండు రాష్ట్రములకు హాని సంభవించదు గనుక, ఆ రాష్ట్రములు తిరుగుబాటుచేయు ప్రజలను యుద్ధతులుగా నంగీకరించకూడదు. అట్లు అంగీకరించిన యెడల ఆ రాజ్యపరిపాలకుల కయిష్టులగుదురు. యుద్ధతులకు సముద్రముమీాద జగడము తటస్థించినపుడు, ఓడ వర్తకము గల యితరరాష్ట్రములు యుద్ధ

తాంగీకారము నీయవలసి వచ్చుచుండును. ఏలనగా, యుద్ధ నావల కుండవలసిన హక్కులు, ముట్టడులు, ఓడల సోదాల యొక్క న్యాయాన్యాయములు, యీ యంగీకారమును బట్టి నిశ్చయింపవలసి యుండును. తటస్థరాజ్యముల వర్తకపుటోడ లను యుద్ధసమయములలో ఒకానొకపుడు పట్టుకొనవచ్చును. సోదా చేయవచ్చును. 1861 వ సంవత్సరములో అమెరికా సంయుక్తరాష్ట్రములకు అంతఃకలహములు సంభవించినపుడు, ఆంగ్లేయుల మధ్యను, అమెరికావారి మధ్యను, యీ విషయ ములు నిర్ణయింపబడినవి. ఒక రాజ్యములో యే భూభాగము నాక్రమించకుండకనే, కేవలము నావికాసైన్యముతో ఒక సంఘము తన ప్రభువులమీఁద నెదుర్కొనినపుడు, దానిని యుద్ధతునిగా అంగీకరించక భూభాగముమీఁద కూడ దానికి కొంత సేన సహాయము చేసినపుడు, యుద్ధతాంగీకారము నీయ వచ్చును.

యుద్ధము ప్రారంభము కాగానే, యుద్ధరాష్ట్రములలో నుండు ప్రజల న్యాయశాస్త్రసంబంధములు మారును. ఉభ యుల సేనలు న్యాయనిబంధనలప్రకారము పోరాడుటకు హక్కు కలిగియుండును. సేనలలో చేరనివారుసయితము విరో ధులతో యేవిధమైన స్నేహసంబంధమును పెట్టుకొనగూడదు. తమ ప్రభువుల సేనల వ్యూహములు, సన్నాహములు, ఊహాలు, విరోధులకు తెలియజేయఁగూడదు. యుద్ధసమ యములో, విరోధరాష్ట్రమువారు యేర్పరచిన కంపెనీలలో

భాగములు దీసికొనకూడదు. వారి కేవిధమైన ద్రవ్యసహాయము చేయగూడదు. యుద్ధము ప్రారంభము కాగానే, విరోధిరాష్ట్రప్రజలమధ్యను వర్తకముతో సంబంధించిన పాలి భాగములు విడిపోవును. సంధిజరిగేవరకు, క్రొత్తగా పాలి భాగముల నేర్పరుచుకొనగూడదు. విరోధిరాష్ట్రములోనున్న బాకీదారులనుండి యుద్ధము జరిగినంతవరకు కోర్టుగుండా బాకీలను వసూలు చేయకూడదు. యుద్ధమునకు పూర్వమందు జరిగిన కంటాక్టులనుబట్టి యెట్టి పరిహారమును పొందుటకు వీలులేదు. యుద్ధము ముగిసినతరువాత వానినిబట్టి కోర్టులలో దావాలు తెచ్చుకొనవచ్చును. విరోధుల ఆస్తికి భీమా చేయకూడదు. విరోధిరాష్ట్రపౌరులమీదకు హుండీలు పంపకూడదు. ఈ సూత్రముల కప్పుడప్పుడు కొన్ని రాష్ట్రముల వారు కొద్ది నిషేధముల నేర్పాటు చేసికొనుచుందురు. విరోధుల ఓడకప్తానులను పట్టుకొన్నపుడు వారివలన కొంత సొమ్మునుగాని, పత్రమునుగాని తీసికొని వదలివేయుదురు. విరోధిరాష్ట్రములో నున్న ఖయిదీలు, తమ జీవనోపాధికి తమదేశస్థులమీదకు హుండీలు పంపవచ్చును. విరోధరాష్ట్రపౌరులకును, తటస్థరాజ్యపౌరులకును, తమ పౌరులతో వర్తకము చేసికొనుటకు ఒక రాష్ట్రమువారు లైసెన్సుల నీయవచ్చును. 1854 వ సంవత్సరములో, తటస్థరాజ్యనావలలో విరోధులుకూడ తమ సరకులను పంపించి వర్తకము జరిగించుకొనవచ్చునని, యుద్ధతులు నిబంధనలను చేసికొనిరి.

యుద్ధము ప్రారంభించగనే, యుద్ధతులకును యితర రాష్ట్రములకును సంబంధించిన సంధులలో, అట్టి యుద్ధమునకు కారణమగునవితప్ప, తక్కిన సంధు లన్నియు అమలులో నుండును. యుద్ధము, సదరు సంధులతో సంబంధించినది కాకపోయినను, వానిలోని కొన్ని షరతులను యుద్ధసమయములలో అమలులో పెట్టుటకు వీలు లేనియెడల తక్కిన షరతులైనను అమలులో నుండవలయును. ఆ సంధులకు దస్కతులు పెట్టిన తటస్థరాజ్యములుమాత్రము, వానిలోని అన్నిషరతులప్రకారము నడచుకొనవలయును. ఆ సంధులను బట్టియే యుద్ధము తటస్థించినయెడల, వానిలో దస్కతుచేసిన తటస్థరాజ్యముల యిష్టమునుబట్టి, ఆ సంధులు అమలులో నుండుట తటస్థించును. కొన్ని మామూలు సంధులకు యుద్ధతులుగాక, యితరులుకూడ పార్టీలుగా నున్నపుడు అట్టి సంధులు సాధారణముగా యుద్ధతులమధ్య నమలులో నుండవు. తటస్థరాజ్యములుమాత్రము అమలులో నుంచుకొనును. యుద్ధతులుమాత్రమే పార్టీలుగా నున్న సంధులు చాలాభాగము అమలులో నుండవు.

---

## అ ధ్యా య ము II.

---

(Conflict between States and their Citizens.)

రాష్ట్ర వ్యక్తిస్వత్వముల వైరుధ్యము

విరోధిరాష్ట్రసేనలలో చేరినవా రందరు విరోధులే. న్యాయనిబంధనలప్రకారము జరుగు యుద్ధములో వారిని చంపవచ్చును, గాయపరచవచ్చును, పట్టుపడినపుడు ఖైదీలుగ చేయవచ్చును. వీరు తటస్థరాజ్యపౌరులమని చెప్పుకొన్నను యేమియు ప్రయోజనము లేదు. తమ పౌరులు విరోధిరాష్ట్ర సైన్యములో చేరి తమమీద యుద్ధము జరిగించినయెడల, వారు పట్టుబడినపుడు వారిని దేశద్రోహులుగ భావించి ఉరి దీయవచ్చును. వర్తకపుటోడలలోని నావికులు, తమ విరోధి రాష్ట్రముమీద తమంతట తామే యుద్ధమునకు దిగకూడదు. తమమీదకు విరోధి వచ్చినయెడల, తమ ఓడను రక్షించు కొనుటకు యుద్ధము చేయవచ్చును. అప్పుడు వారు పట్టుబడిన యెడల, వారి విరోధులు యుద్ధతులుగ భావించి యుద్ధాంతము వరకు వారిని, తక్కిన యుద్ధభటులవలెనే సంరక్షించవల యును. ఈ వర్తకపుటోడల నావికులు, తమంతట తామే విరోధిఓడలపైకి దండెత్తినయెడల వారిని విరోధి దండించ వచ్చును. సైన్యములో చేరని విరోధిరాష్ట్రప్రజలకు యేవిధ ముగను హానిని కలుగచేయకూడదు. వారి ఆస్తిమాత్రము

విరోధిఓడలమీద నుండగా పట్టుకొనబడవచ్చును. వారి దేశ విభాగమును విరోధి ఆక్రమించుకొన్నయెడల, అక్కడిఅందరి జనులమీదను, విరోధి పన్నులను వేయవచ్చును. ఈ యుద్ధములో చేరని విరోధిరాష్ట్రప్రజనులు, తటస్థరాజ్యములోనే నివాస మేర్పరుచుకొనియున్నయెడల, వారిని పట్టుకొనకూడదు. వారిమీద పన్నులను వేయకూడదు. కాని వారి ఆస్తిమాత్రము విరోధిరాష్ట్రములో నున్నయెడల దానిని పట్టుకొనవచ్చును. విరోధిరాష్ట్రములో నివశించుచున్న జనులు, దానిమీద యుద్ధము చేయుచున్న రాష్ట్రపౌరులైనను లేక తటస్థరాజ్యపౌరులైనను విరోధులుగనే కొంతవరకెంచబడుదురు. వారున్న దేశములో వారికిగల ఆస్తిని, విరోధులయాస్తివలెనే యెంచబడి, అది సముద్రముమీదనున్నను, భూమిమీద నున్నను పట్టుకొనబడవచ్చును. ఒక రాష్ట్రములోనికి విరోధి ప్రవేశించి కొంత దేశభాగమును ఆక్రమించుకొన్నపుడు దానిలోనుండు ప్రజలను మొదటి రాష్ట్రము వారు విరోధులుగనే యెంచెదరు. ఏలననగా, వారు తమ వ్యాపారములు మొదలగువానివలన తమవిరోధికి సహాయము చేయుట సంభవించును. విరోధి వెళ్లగొట్టబడగానే, తిరిగి ఆ దేశవిభాగములోని జనులు తమ పౌరులే యగుచుందురు. తటస్థరాజ్యప్రజలు విరోధిదేశములో వర్తకము చేయుచున్నపుడు ఆ వర్తకముతో సంబంధించిన సరకును పట్టుకొనవచ్చును. విరోధిరాష్ట్రవర్తకుడు తటస్థరాజ్యములో వర్తకము

చేయుచున్నపుడు ఆ వర్తకముతో సంబంధించిన సరుకులను నడిసముద్రముమీద పట్టుకొని వానిని యీ శాస్త్రప్రకారము స్వాధీనపరుచుకొనవచ్చును.

పైన చెప్పిన విషయములనుబట్టి ఒక వ్యక్తి విరోధుడైనది, తటస్థుడైనది తెలిసికొనుటకు అతని స్థిరనివాసమును బట్టి యుండును. ఉద్దేశమునుబట్టియు, నివసించు కాలపరిమాణమునుబట్టియు, అతని స్థిరనివాసమును కనిపెట్టవలయును. ఒకచోటునకు బోయి అక్కడనే యుండవలయునని యుద్దేశము స్పష్టమైనపుడు, అత డక్కడకు వెళ్ళినతోడనే స్థిరనివాస మేర్పడును. అట్టి యుద్దేశము స్పష్టముగా కనపడనపుడు, అక్క డెంతకాల మున్నను స్థిరనివాస మేర్పడినట్లెంచబడదు. ఒక దేశపౌరుడు మరియొక దేశములో కాపురము నేర్పరుచుకొన్నయెడల, యీ రెండవదేశములో వాని ఆస్తిని విరోధి పట్టుకొనవలెనన్న వాని స్థిరనివాసమునుబట్టి యుండునుగాని, జాతీయతనుబట్టి యుండదు. అతని స్థిరనివాసము తటస్థరాజ్య మైనయెడల, ఆరాజ్యముతో సంబంధించిన అతని యాస్తి యుద్ధతులు పట్టుకొనగూడదు. ఆ రాజ్యము యుద్ధతులలో నౌకరి దైనయెడల దానితో సంబంధించిన అతని ఆస్తిని విరోధి పట్టుకొనవచ్చును. తాను పౌరుడుగా నుండు దేశములోని యాస్తి ఆదేశముయొక్క యుద్ధత, తటస్థస్వభావములతో సంబంధించియుండును.

విరోధిరాష్ట్రియుద్ధనావలు, ఫిరంగులు, మందుగుండు సామానులు యుద్ధము చేయదగిన స్థలములయం దెక్కడ

కనుపడినను పట్టుకొనవచ్చును. విరోధి రాష్ట్రపౌరుల ఆస్తినేగాని తటస్థరాష్ట్రపౌరుల యాస్తిని పట్టుకొనగూడదుగనుక, యుద్ధము ప్రారంభముకాగానే విరోధులు తమ ఆస్తిని తటస్థ రాజ్యముల ఓడలలో పంపుచుందురు. విరోధుల ఓడలుగాని, సరకులుగాని నడిసముద్రములోనుండగా యుద్ధము తటస్థించినను, లేక యుద్ధము జరుగుట సిద్ధమని తోచినను వానిని తటస్థులకు పరివర్తన చేయగూడదు. శాంతసమయములో ఒక నావలో సరుకు యెగుమతి జేయగనే, అది దిగుమతి దారునకు చెందును. కాని ఒకానొకపుడు ఆ నావ సబురు అనంతరమునగాని అతనికి చెందకుండునట్లు ముందుగా యేర్పాటు చేసికొనవచ్చును. యుద్ధసమయములో దిగుమతి దారుడు విరోధిరాష్ట్రపౌరుడైనయెడల, అట్టి యేర్పాటు లున్నను నావ బయలుదేరునప్పటినుండియు, సరకు అతని దనే యెంచబడును. అతడు తటస్థరాజ్యపౌరుడైనయెడల, తానే యా సరకుకు అధికారిగాని, యెగుమతిదారుడు కాడని రుజువుపరచవలసియుండును.

తటస్థులు యుద్ధతుల దేశములోగాని, లేక యుద్ధతు లాక్రమించుకొన్న స్థలములలోగాని స్థిరాస్తి గలిగియున్న యెడల, దానిలోని అయివజుకూడ స్థిరాస్తితోపాటు విరోధి ఆస్తిగనేయెంచబడును. దాని యజమానులు తటస్థదేశములో నివశించువారైనను, అది విరోధియాస్తిగనే యెంచబడును. ఒక ఆస్తి తటస్థులదైనను, విరోధుల స్వాధీనములో నున్న

యెడల, అవి విరోధియాస్తిగనే పరిగణింపబడును. ఒక యోడ యుద్ధతుల నాయకులను గలిగి, వారి వర్తకములో తిరుగుచున్న యెడల, అది తటస్థులదైనను విరోధియాస్తిగనే భావింపబడును. తటస్థరాష్ట్రపౌరుల యోడ, యుద్ధతులజండా వేసికొని ప్రయాణము చేయుచున్నపుడుగాని, లేక వారివలన లైసెన్సును పొందినపుడుగాని, అది విరోధి నావగనే యెంచబడును. శత్రువుల యుద్ధపుటోడలపైన తటస్థులసరకు లున్నపుడు, వాని తటస్థత నశించి అవి శత్రువుల యాస్తిగనే భావింపబడి, విరోధివలన పట్టుకొనబడవచ్చును. కాని అట్టి సరకులు శత్రువుల ఆయుధధారులైన వర్తకపుటోడలలో వేసి పంపబడినపుడు, వానిని పట్టుకొనవచ్చునని ఆంగ్లేయులును, పట్టుకొనఁగూడదని అమెరికనులును వారివారి కోర్టులలో తీర్పు చేసికొని యున్నారు. ఆంగ్లేయుల తీర్పులే న్యాయమైనవని తోచుచున్నది. ఏలనన, ఎప్పుడు శత్రువుల ఆయుధధారియైన యోడలో తటస్థులు సరకులను వేసిరో, అప్పుడే వారు యుద్ధముచేసిరైనను ఆ సరకులను పట్టుబడకుండ చేసికొనుటకు ప్రయత్నములు చేయుచున్నట్లు యెంచబడవలయును. ఒక స్థలము తటస్థులదా, లేక శత్రువులదా యను విషయమును నిర్ధారణ చేయవలెనన్న అది యెవరి స్వాధీనములో నున్నదీ, దాని నెట్లుపయోగించుచున్నది, యీ మొదలగు విషయములను గమనించవలయును.

---

# అ ధ్యా య ము III

---

(Enemy persons)

## శా త్ర వ శ రీ ర ర ణ నీ తి

రెండురాష్ట్రములకు యుద్ధముసంభవించినపుడు, తమ తమ దేశములలో నున్న శత్రురాజుల పౌరులను నిర్బంధించి కారాగృహములలో వేయకూడదు. వారివలన తమకు యిబ్బందులు కలుగునని భయము కలిగినపుడు వారిని దేశము నుండి వెడలగొట్టవచ్చును. కాని, బలమైన హేతువు లుండి ననేతప్ప విరోధిరాష్ట్రపౌరులను, వారి రాజ్యమునకు సహాయము చేయనంతవరకు దేశములో నుంచవలెను. మొదట నీ రాజనీతి సూత్రమును 1756 వ సంవత్సరములో ఆంగ్లేయులు ఫ్రెంచివారితో యుద్ధము చేయునపుడు అమలులో పెట్టిరి. వారు 1794 వ సంవత్సరములో నీ విధముగనే, అమెరికా వారితో ఒడంబడికను చేసికొనిరి. తక్కిన రాష్ట్రములు క్రమక్రమముగ వారిమార్గమునే అవలంబించెను. 1870 వ సంవత్సరములో జర్మనీవారు పారిసునగరము మీదకు వచ్చుచుండగా, ఫ్రెంచివారు తమ ప్రజలకును, అక్కడనుండు జర్మనులకును జగడము జరుగునని భయపడి, జర్మను పౌరులనందరిని వెడలగొట్టిరి. అప్పటి సంగతిసందర్భములను బట్టి, యిట్టిపని న్యాయముగానే యుండవచ్చును గాని, సామాన్య

ముగ తమదేశములో నుండు శత్రురాష్ట్రపౌరులను అరెస్టు చేయగూడదు, వెడల గొట్టకూడదు.

శత్రుసైనికులు, యుద్ధము మానివేసి శరణుజొచ్చినపుడు వారిని ఖైదీలుగ తీసికొని పోవలసినదేగాని చంపకూడదు. యుద్ధములో దొరకిన ఖైదీలను దయతో చూడవలెను. యుద్ధము ముగిసినతోడనే, వారిని వదలివేయవలెను. ఒకప్పుడు, వారిని, యుద్ధము ముగియువరకు, యే విధమైనజోక్యము కలుగజేసికొనకుండు పద్ధతితో వారిని వదలివేయుచుందురు. వారు, అట్టి యొడంబడికకు వ్యతిరేకముగ యుద్ధములోనికి తిరిగివచ్చిన యెడల, పట్టుబడినపుడు చంపివేయవచ్చును. పట్టుబడిన ఖైదీలచేత వారివారి గౌరవమునకు లోపములేకుండ యుద్ధముతో సంబంధించని యేపనియైనను చేయించవచ్చును. మిలిటరీయుద్యోగస్థులు వారిచేత పనిపాటలు చేయించుకొనవచ్చును. వారికీయవలసిన జీతములలోనుండి, భోజనపుఖర్చులు తీసివేసి, మిగిలిన పైకమును, వారిని పంపివేయునపుడు వారికిచ్చెదరు. సాధారణముగా శత్రుసైన్యములో చేరినవారినే, యుద్ధములో ఖైదీలనుగ తీసికొనెదరు. సైన్యములో చేరనప్పటికి, స్థితిగతులను బట్టి శత్రువులకు మిక్కిలి సహకారులుగ నున్నవారిని కూడ పట్టుకొనవచ్చును. శత్రువుల వర్తకపు నావలోని నౌఖరులు, మిలిటరీ పోలీసువారు, తంతినడపువారు, ఆకాశయానము చేయువారు, యుద్ధములో నున్నపుడు పట్టుకొనవచ్చును. పత్రికావిలేఖకులు పట్టుబడినపుడు,

వారి నెన్నటికిని రాకుండ వెడలగొట్టెదరు. శత్రురాజకుటుంబ ములో చేరినవారును, ముఖ్యమంత్రులు, రాయబారులు మొదలగు మంత్రాంగికులును యుద్ధములో చేరియుండక పోయినను పట్టుబడవచ్చును. యుద్ధములో దొరకిన శత్రువులను తమరు కాపాడుట కష్టమని యెంచి వారిని చంపుట మిగుల ఘోరకృత్యము. 1799 వ సంవత్సరములో జాఫాదుర్గములో నున్న నాలుగువేల శత్రుసైన్యమును నెపోలియన్ పట్టుకొన్నపుడు వారికి తిండిపెట్టుట అసాధ్యమయ్యెను. తన సైన్యము తిండిలేక మాడుచుండెను. వారిని తిరిగి యీజిప్టుదేశమునకు పంపవలెనన్న తనకు సైన్యము చాలదు. వారివలన ప్రమాణములు తీసికొని పంపివేసిన యెడల, శత్రువులలో జేరి వారు తనమీద పడవచ్చును. ఇట్టి సందర్భములో తన యుద్యోగస్థులతో రెండుదినములు దీర్ఘాలోచనచేసి, వారిప్రాణములను కాపాడెదనని తనవాగ్దానము మీద లోబడిన శత్రుసైన్యము నంతయు తుపాకీగుండ్లతో చంపించెను.

యుద్ధములో పట్టుబడినవారిలో రోగులను, గాయములు తగిలినవారిని, తగిన పరామర్శచేసి బాగుచేయవలయును. 1864 వ సంవత్సరములో, జినీవాపట్టణములో, యూరపురాష్ట్రములన్నియు అన్యోన్యముగ, యీ విషయమై ఒక ఒడంబడికను చేసికొన్నవి. ఆసుపత్రులు, గాయములు తగిలిన వారిని మోసికొనిపోవు వాహనములు, రోగులను సంరక్షించు పరిచారకులు, తెల్లవస్త్రముమీద యెర్రచారల క్రైస్తవ

శిలువను (Red-cross) కలిగియున్న యెడల, వారిమీద గుండ్లను వేయకూడదు. ఖైదీలను, వారిగాయములు మాన్పిన తరువాత, యుద్ధముచేయుట కశక్తులైన యెడల, వారి దేశమునకు పంపివేయవచ్చును. ఒకప్పుడు, యుద్ధములోనికి తిరిగి రాకుండనుండు పద్ధతితో, వారిని పంపివేయుచుందురు.

బలమైన ముట్టడిమీద, అధికశౌర్యముతో ఒకకోటను పట్టుకొన్నపుడు, ఆ కోటలో నుండిన విరోధిరక్షకసైన్యమును ఖైదీలనుగ చేయవలయునుగాని చంపకూడదు. శత్రుసైన్యములకు అనవసరమైన బాధలను కలిగించకూడదు. వారిని యుద్ధము చేయలేకుండ చేయుటయే ముఖ్యముగాని, వారిని బాధించుట, చంపుట న్యాయముకాదు. తుపాకిగుండు వేసి, చేతులు బ్రద్దలగునటుల చేయవచ్చునుగాని, గాజుపెంకులు, మేకులు మొదలగువానిని వేసి, శస్త్రవైద్యమునకు దుర్ఘటమైన గాయములను గావించకూడదు.

యుద్ధము జరుగుచున్నపుడు, అకస్మాత్తుగ, లేక తప్పక, సంభవించు అపాయములు గాక సాధారణముగ యుద్ధములో చేరని శత్రుపౌరులకే విధమైన హానియు కలిగించకూడదు. శత్రుసైన్యమును తీసికొనిపోవుచున్న రైలుబండ్లమీద గుటిపెట్టి కాల్చినపుడును, ఒకగ్రామమును పట్టుకొనబోవునపుడును, సైన్యములో చేరనివారికి కూడ నపాయము సంభవించవచ్చును. ఇది న్యాయశాస్త్రమునకు విరోధముకాదు. ఆకాశనావలమీద నుండి బాంబులు, కోటలమీద వేయవచ్చును

గాని బయట పల్లెలలో నుండు నిరపరాధులైన ప్రజలమీద ప్రయోగింపకూడదని, యూరపు మహాసంగ్రామములో యుద్ధ తులకు, అమెరికావారు కబురు పంపిరి. ఒక కోటను ముట్ట డించి, దాని గోడలు శీఘ్రకాలములో పడిపోవునని యెంచి నపుడు, ముట్టడివేసిన సైన్యాధిపతి ఆ కోటలోనివారికి, వారి పిల్లలను, స్త్రీలను, అశక్తులను, యుద్ధము చేయదలచుకొనని వారిని వెడలిపొమ్మని తెలియఁజేయుట ఆచారమైయున్నది. గత యుద్ధములో జర్మనీ సేనానాయకుడు, ఆంటువర్పు ముట్ట డిలో, ఆ విధముగనే తెలియచేసి లోపలి కోటలను పడగొ ట్టెను. ఒక కోటలోని వారిని తిండిలేక మాడునటులచేసి, దానిని స్వాధీన పరచుకొనవలెనన్న ఆ కోటలోని వారిని బయటకు రానీయకుండ జాగ్రతతో చూచుచుండవలయును. ఇతరులనుగాని, ఆహారపదార్థములనుగాని లోపలకు బోకుండ కనిపెట్టి యుండవలయును. ఈ విధముగ కోటలో నున్నవారికి ఆకలిబాధను కలిగించి, వారిని లోబడునటుల చేయుట యీ ధర్మశాస్త్ర మంగీకరించు చున్నది.

దండెత్తబడిన దేశములోని ప్రజలు దండెత్తినవారు వేయు పన్నుల నిచ్చుకొనుచున్నంతవరకు, తమ నిత్యకృత్య ములును, వ్యాపారములును నెమ్మదిగా చేసికొనవచ్చును. వారి ప్రభువులమీద యుద్ధము చేయవలసినదని దండెత్తిన వారు, ఆ దేశప్రజలను నిర్బంధించకూడదు. కాని తమకు దారులు చూపవలయునని వారిని కోరవచ్చును. తమకు కావ

లసిన బండ్లవాండ్రను బలవంతపరచి, వారిచేత పనులను చేయిం చుకొనవచ్చును. దారి చూపువాడు తప్పుత్రోవను తీసికొని పోయినయెడల, వానిని చంపివేయవచ్చును. దేశప్రజలు, దండెత్తివచ్చినవారిమీద యుద్ధము చేయవలెనన్న తమ దేశ సైన్యములో చేరవలసినదే గాని తాము శత్రుసైన్యములో వారినిగాని దాని కావలివాండ్రను గాని చంపకూడదు. ఇట్లు జరిగించుటచేతనే, జర్మనులు, గత యుద్ధములో, లోవైను, బెల్జియము, రీమ్సు, బ్రస్సెల్సు, మొదలగు స్థలములలో శత్రు సైన్యములో చేరనివారిని చంపుటయు, గోపురములు, ఇండ్లు, పుస్తకభాండాగారములు తగులబెట్టుటయు, తటస్థించెనని చెప్పు చున్నారు. తమ దేశము నాక్రమించిన విరోధుల యుద్ధప్రయత్న ములను తమ ప్రభువులకు తెలియ జేయగూడదు. ఇట్లు జరి గించినపుడు, నిరపరాధులు కూడ శిక్షింపబడుట తటస్థించు చుండును. నేరములు చేసినవారు పట్టుపడని యెడల, అచ్చట నుండు ప్రముఖులలో కొందరిని పట్టుకొని శిక్షించవచ్చును. ఒక పట్టణమును పట్టుకొన్న తరువాత జయించిన శత్రు సైన్యము విచ్చలవిడిగ దానిలో ప్రవేశించి జనులను చంపగూ డదు. కొల్లగొట్టకూడదు. రోగులను, గాయములు తగిలిన వారిని సంరక్షించు జనమును యే విధముగను బాధించకూ డదు. వారిని ఖైదీలుగ చేయకూడదు. దేశమునుండి వారిని వెడల గొట్టకూడదు.

---

# అధ్యాయము IV

(Enemy property)

## శాత్రవస్వాధీకరణనీతి

యుద్ధారంభమందు శత్రువుల ఆస్తి తమదేశములో నున్నప్పుడు, అది తక్షణము పట్టుకొనబడును. విరోధి యోడలు, ధనము, మందుగుండుసామాను, మొదలగునవి తీసికొనబడును. కాని వారి గ్రంథములు, చిత్తరువులు, విగ్రహములు, పురాతనపు వ్రాతపత్రములు వారికిచ్చివేయబడును. ఒక దేశములో విరోధి పౌరులకు స్థిరాస్తి యున్నయెడల, దానిని తీసికొను నాచారములేదు. ఇదివరకు వివిధరాష్ట్రములమధ్య జరిగిన సంధులను బట్టియు, ఆచారములను బట్టియు విరోధదేశముల పౌరుల చరాస్తిని బలాత్కారముగ తీసికొనుట లేదు. ఒకవేళ అట్టి ఆస్తిని జప్తుచేసినను, యుద్ధాంతమందు తిరిగి వాని యజమానులకు యిచ్చివేయబడును. విరోధి పౌరులకు, తమదేశజనులు బాకీపడి యున్నయెడల, సదరు బాకీలను జప్తుచేయకూడదని 1817 వ సంవత్సరములో యింగ్లీషు కోర్టులు తీర్పుచేసినవి గాని ఆతీర్పులు న్యాయమైనవి కావని శాస్త్రజ్ఞుల యభిప్రాయమై యున్నది. యుద్ధతులు, విరోధి పౌరుల కీయవలసిన బాకీలను, తక్కిన చరాస్తివలెనే జప్తు చేసి తీసికొనవచ్చును. గాని, అట్లు జరిగించు నాచారములేదు.

యుద్ధసమయములో సదరు బాకీలకు దావాలు చేయుటకు వలనుపడదు. యుద్ధాంతమందు వానిని రాబట్టుకొనుటకు దావాలు చేయవచ్చును.

ఒకదేశ ప్రభువులకు శత్రురాష్ట్రపౌరులు యుద్ధమునకు పూర్వమందు, అప్పులిచ్చి యున్నయెడల, ఆ యప్పులను, యుద్ధము తటస్థించిన తరువాత, జప్తుచేయకూడదు. యుద్ధము జరుగు సమయములో కూడ, ఆ యప్పులమీద వడ్డీని యిచ్చుచునే యుండవలెను. అట్లు చేయని యెడల రాష్ట్రములకు గౌరవహాని సంభవించును గనుక యీ యాచారము సర్వత్ర ప్రబలియున్నది.

యుద్ధములో కొల్లగొట్టిన ఆస్తియంతయు కొల్లగొట్టిన సైన్యమువారికి చెందక, వారి రాష్ట్రాధికారులకే చేరును. ఒకప్పుడు ప్రభుత్వమువారు, తమ సైనికులకు, ఆయాస్తిలో కొంతభాగము నిచ్చి మిగత ఆస్తి తాము పుచ్చుకొనునట్లు నిబంధనలను చేసికొనుచుందురు. శత్రువులనుండి లాగుకొన్న తుపాకులు, పిరంగులు, మందుగుండు సామగ్రిని ప్రభుత్వమువారే తీసికొనెదరు.

విరోధిరాష్ట్రములో నొక భాగమును స్వాధీనము చేసికొన్నపుడు, జయించిన సైన్యము, తన యిష్టము వచ్చినటుల దేశమును కొల్లగొట్టకూడదు. ఎవరి యాస్తిని గాని దొంగిలించ కూడదు. బలాత్కారముగ తీసికొన గూడదు. అట్లు చేసిన వారిని సేనాధిపతి కఠినముగ శిక్షించవలెను. అక్కడి

ప్రజలమీద తనకు కావలసిన ఖర్చులకు కొంత కప్పము వేయ వచ్చును. తనసేనకు కావలసిన భోజనపదార్థములను సొమ్మిచ్చి కొనవలెను. తనకు న్యాయమని తోచిన ధరలకే తీసికొన వచ్చును. ఒకప్పుడు సొమ్ము నీయనక్కర లేకుండ వానిని తీసికొనుటయు కలదు. కాని సాధారణముగా డబ్బు ఖర్చు పెట్టియే, తమకు కావలసిన పదార్థములను కొనవలయును. ఒక్కొక సమయములో విరోధి సైన్యమునకు కావలసిన భోజనపదార్థములు సప్లయి చేయుటవలన ఆదేశ ప్రజలకు క్షామము సంభవించవచ్చును. దండెత్తిన సైన్యమునకు బండ్లు తోలుటకు సేద్యగాండ్రు బలవంతపరచబడు చుందురు. రయితు భూమిమీదనున్న పంట, వర్తకుని సరకులు, విరోధిసైన్యము చూరగొనవచ్చును. సామాన్యప్రజలు, తమ దేశమునకై పోరాడుటకును, తమ సేనలకు సహాయము చేయుటకును ఏమాత్రము ప్రయత్నించినను, వారు చంపబడుదురు.

విరోధి సైన్యమున కిట్టి గొప్పహక్కులు కలుగ వలెనన్న, వా రాక్రమించుకొన్న శత్రుదేశము తమ సంపూర్ణ స్వాధీనములో నుండవలెను. అక్కడి ప్రజలను, శత్రుసేనాధి పతి తనసేనలో కలసి పోరాడవలసినదని నిర్బంధించ కూడదు. యుద్ధాంతమందు సంధిగుండా గాని సంధి లేకుండ గాని తనకు స్వాధీనమైన దేశవిభాగమును విరోధిరాష్ట్రము తన రాజ్య ములో కలుపుకొన వచ్చును. అప్పుడు, అక్కడి ప్రజలను తన ప్రజలుగనే భావించి, వారిని రాజభక్తులనుగా చేయవచ్చును.

అంతవరకు యుద్ధమధ్యమందు తన యుద్ధతహక్కులను, ప్రజల సురక్షితమునకు భంగము లేకుండ, కాపాడుకొనవలయును. ఒక దేశమును జయించి, దాని యెల్లలవద్ద తగినంత సైన్య ముంచుకొన్న రాష్ట్రము, ఆదేశమును తన స్వాధీనములో నుంచుకొన్నటులనే యెంచబడును. ప్రతి స్థలమందును, తన సైన్య ముండనక్కరలేదు. అవసరమైనపుడు, తన సేనలను పంపగలిగిన యెడల చాలును. ఆదేశములో నెమ్మదికి యేవిధ మైన భంగము కలుగజేయకుండ చేయవలెను. ఆ దేశపు రాజునకక్కడ సైన్యము లేకుండ చేయవలెను. గత అయిరోపా యుద్ధములో బెల్జియము రాష్ట్రము, జర్మనీ స్వాధీనములో నున్నదని చెప్పుట కేవిధమైన సందేహము లేదు. యుద్ధాంత మున గాని, ఆదేశమునకు జర్మనీ చక్రవర్తి రాజుగా భావింప బడడు. జర్మనీ ఓడిపోవుటవలన, అట్లు జరుగలేదు.

యుద్ధ మధ్యమందు స్వాధీనము చేసికొన్న దేశములో నుండు విరోధియొక్క స్థిరాస్తియంతయు దండెత్తినవా రుపయోగపరచుకొనవచ్చును. అడవులమీాది పన్నులు, యిండ్ల అద్దెలు, రాజుగారి స్వంతభూములు, విరోధిరాష్ట్రమువారి వగును. వీరి సైన్యము రాచనగరులలో దిగవచ్చును. వానిని తమ వైద్యశాలలుగ మార్చవచ్చును. వారిగుళ్లను, గోపుర ములను యుద్ధసంబంధమైన పనుల కుపయోగించవచ్చును. కాని వానిని దుర్బుద్ధితో పడగొట్టకూడదు. వానిలో శత్రు వులు ప్రవేశించి దండెత్తిన సైన్యముమీాద యుద్ధముచేయు

టకు ప్రయత్నించినపుడు వానిని పడగొట్టవలసి వచ్చుచుం డును. సాధ్యమైనంతవరకు ఆసుపత్రులు, పురమందిరములు, పుస్తకభాండాగారములు, పాఠశాలలు, దేవాలయములు, మున్నగువానిని కాపాడవలయును. వీనిమీదగుండ్లు పడ వేయకుండ, అక్కడ వారు బావుటాల నెత్తియుంచవలెను.

యుద్ధమధ్యమందు విరోధి స్వాధీనముచేసికొన్న స్థిరా స్తిని యితరులకు అమ్మినపుడు యుద్ధాంతమందుకూడ నది యతని స్వాధీనములోనే యున్నయెడల ఆక్రయముచెల్లును. లేనియెడల, ఆక్రయము, అసలు ఖామందు నెంతమాత్రము బాధించదు. యుద్ధము జరుగుచున్న సమయములో, దేశ మును స్వాధీనముచేసికొన్న శత్రువువలన ఒక తటస్థ రాజ్యము క్రయము చేసికొన్నయెడల, అసలు ఖామందుకు ఆ తటస్థరాజ్యము విరోధియగును. వెళ్ళగొట్టబడిన రాజు విక్ర యించినయెడల, యుద్ధాంతమందు ఆదేశ విభాగము తనస్వాధీ నమునకు వచ్చినయెడల, ఆక్రయము చెల్లును. లేని యెడల ఆక్రమించుకొన్న రాష్ట్రమును అది బాధించనేరదు. ఆక్ర మింపబడిన దేశములోని చరాస్తి దండెత్తిన రాష్ట్రమువా రుపయోగించుకొనవచ్చును. అదివరకు అమలులోనున్న పన్నులలో రాజ్యపరిపాలన ఖర్చులుపోగా, మిగిలినది తమ యిష్టానుసారము వినియోగించుకొనవచ్చును. అక్కడనున్న పుస్తకభాండాగారములు, ప్రకృతిశాస్త్రములకు సంబంధించిన

అంతవరకు యుద్ధమధ్యమందు తన యుద్ధతహక్కులను, ప్రజల సురక్షితమునకు భంగము లేకుండ, కాపాడుకొనవలయును. ఒక దేశమును జయించి, దాని యెల్లలవద్ద తగినంత సైన్య ముంచుకొన్న రాష్ట్రము, ఆ దేశమును తన స్వాధీనములో నుంచుకొన్నటులనే యెంచబడును. ప్రతి స్థలమందును, తన సైన్య ముండనక్కరలేదు. అవసరమైనపుడు, తన సేనలను పంపగలిగిన యెడల చాలును. ఆ దేశములో నెమ్మదికి యేవిధ మైన భంగము కలుగజేయకుండ చేయవలెను. ఆ దేశపు రాజునకక్కడ సైన్యము లేకుండ చేయవలెను. గత అయిరోపా యుద్ధములో బెల్జియము రాష్ట్రము, జర్మనీ స్వాధీనములో నున్నదని చెప్పుట కేవిధమైన సందేహము లేదు. యుద్ధాంత మున గాని, ఆ దేశమునకు జర్మనీ చక్రవర్తి రాజుగా భావింప బడడు. జర్మనీ ఓడిపోవుటవలన, అట్లు జరుగలేదు.

యుద్ధ మధ్యమందు స్వాధీనము చేసికొన్న దేశములో నుండు విరోధియొక్క స్థిరాస్తియంతయు దండెత్తినవా రుపయోగపరచుకొనవచ్చును. అడవులమీది పన్నులు, యిండ్ల అద్దెలు, రాజుగారి స్వంతభూములు, విరోధిరాష్ట్రమువారి వగును. వీరి సైన్యము రాచనగరులలో దిగవచ్చును. వానిని తమ వైద్యశాలలుగ మార్చవచ్చును. వారిగుళ్లను, గోపుర ములను యుద్ధసంబంధమైన పనుల కుపయోగించవచ్చును. కాని వానిని దుర్బుద్ధితో పడగొట్టకూడదు. వానిలో శత్రు వులు ప్రవేశించి దండెత్తిన సైన్యముమీద యుద్ధముచేయు

టకు ప్రయత్నించినపుడు వానిని పడగొట్టవలసి వచ్చుచుండును. సాధ్యమైనంతవరకు ఆసుపత్రులు, పురమందిరములు, పుస్తకభాండాగారములు, పాఠశాలలు, దేవాలయములు, మున్నగువానిని కాపాడవలయును. వీనిమీదగుండ్లు పడ వేయకుండ, అక్కడ వారు బావుటాల నెత్తియుంచవలెను.

యుద్ధమధ్యమందు విరోధి స్వాధీనముచేసికొన్న స్థిరాస్తిని యితరులకు అమ్మినపుడు యుద్ధాంతమందుకూడ నది యతని స్వాధీనములోనే యున్నయెడల ఆక్రయముచెల్లును. లేనియెడల, ఆక్రయము, అసలు ఖామందు నెంతమాత్రము బాధించదు. యుద్ధము జరుగుచున్న సమయములో, దేశమును స్వాధీనముచేసికొన్న శత్రువువలన ఒక తటస్థ రాజ్యము క్రయము చేసికొన్నయెడల, అసలు ఖామందుకు ఆ తటస్థరాజ్యము విరోధియగును. వెళ్ళగొట్టబడిన రాజు విక్రయించినయెడల, యుద్ధాంతమందు ఆదేశ విభాగము తనస్వాధీనమునకు వచ్చినయెడల, ఆక్రయము చెల్లును. లేని యెడల ఆక్రమించుకొన్న రాష్ట్రమును అది బాధించనేరదు. ఆక్రమింపబడిన దేశములోని చరాస్తి దండెత్తిన రాష్ట్రమువారుపయోగించుకొనవచ్చును. అదివరకు అమలులోనున్న పన్నులలో రాజ్యపరిపాలన ఖర్చులుపోగా, మిగిలినది తమ యిష్టానుసారము వినియోగించుకొనవచ్చును. అక్కడనున్న పుస్తకభాండాగారములు, ప్రకృతిశాస్త్రములకు సంబంధించిన

వస్తువులు మొదలగువానిని తమ దేశమునకు తీసికొని పోగూడదు.

ఆక్రమించుకొన్న దేశములోని ప్రజల ఆస్తిని బలవంతముగ దండెత్తినరాష్ట్రము పట్టుకొని పోగూడదు. యుద్ధమునకు మిక్కిలి యవసరమగునపుడు మాత్రము దాని నుపయోగించుకొనవచ్చును. తమసేనలను పౌరుల గృహములలో బస చేయించవచ్చును. దేశసైన్యములో చేరని పౌరులు వారియిండ్లలోనుండి దండెత్తిన సేనలమీద తుపాకిగుండ్లను ప్రేల్చినయెడల, వారిగృహములను ధ్వంసముచేసి, వారిని శిక్షించవచ్చును. శత్రువుల యేజంట్లకు తమగృహములలో తావొసంగినను, శత్రువులకు సమాచారము తెలియజేసినను, దేశము నాక్రమించిన శత్రురాష్ట్రమువారు కఠినముగ శిక్షించవచ్చును.

ఒక దేశము నాక్రమించుకొన్నపుడు, ఆక్రమించుకొన్న శత్రువులు అక్కడిపౌరులనుండి తమకుకావలసిన పదార్థములను బలాత్కారముగ తీసికొనవచ్చును. నాగరికరాష్ట్రములన్నియు తమసేనలకు అవసరమగు వస్తువులను పంపుచునేయుండును. కాని ఒకప్పుడు సైన్యాధిపతి ఆయా జిల్లాల ప్రజలను బలవంతపెట్టిగాని కొద్దిగనో గొప్పగనో సొమ్ముయిచ్చిగాని కావలసిన సరకులను తీసికొనక తప్పదు. దేశమును ఆక్రమించుకొన్న సైన్యముమీద నేరములు జరిగించినపుడు

దౌర్జన్యము చేసినవారు పట్టుబడనియెడల, అక్కడి ప్రజల మీదశిక్షార్థముగ కొంతపన్నును విధించెదరు.

సాధారణముగా, నావలు, నావలమీదనుండు సరకులు మొదలగువానిని, శత్రురాజులవైనను, వారి ప్రజలవైనను పట్టుకొనవచ్చును. శత్రురాజుల నావలు, వారి స్వదేశరేవులలో నున్నను, నడిసముద్రముమీదనున్నను, తమ దేశములోనున్నను యుద్ధతులు పట్టుకొనవచ్చును. తటస్థ రాజ్యములకంటియున్న సముద్రశాఖలలో నున్నపుడు మాత్రము పట్టుకొనగూడదు. శత్రురాజుల యోడలనైనను, క్రొత్తదేశములను కనిపెట్టుటకును, శాస్త్రపరిశోధనల నిమిత్తమునకును ప్రయాణముచేయుచున్నపుడు, అవి విరోధిరాష్ట్రమువలన లైసెన్సు తీసుకొన్నయెడల, పట్టుకొనగూడదు. యుద్ధతులు తీసికొన్న ఖయిదీలను యుద్ధసమయములో ఒండొరులకిచ్చివేయుటకై యేర్పడిన నావలను (Cartel ships) పట్టుకొనకూడదు. కాని యీనావలు సరకులనుగాని రాజకీయలేఖలనుగాని తీసికొనిపోగూడదు. శత్రువుల ఆసుపత్రి ఓడలను పట్టుకొనవచ్చును. శత్రుపౌరుల ఓడలు వారి దేశ బావుటాలను కలిగియుండును. ఒకప్పుడు దొంగతనముగా విదేశీయ బావుటాలను వేసికొనుటయు, తన నిజస్వభావము తెలియకుండ అబద్ధపు ప్రకటనలుగల కాగితములుంచుకొనుటయు జరుగవచ్చును. దానిని సోదాచేసి యుద్ధతులు నిజమును తెలిసికొని, అది శత్రువులదని వారికి తోచినయెడల, దానిని

పట్టుకొనెదరు. తటస్థరాజ్యములవారి యోడలు శత్రువుల బావుటాలను, ప్యాసును కలిగియున్నను, లేక శత్రువుల కైసె న్యముతో ప్రయాణము చేయుచున్నను పట్టుకొనబడవచ్చును. తటస్థరాజ్యములవారి సముద్రములో నున్నపుడుతప్ప, శత్రు రాష్ట్రపౌరుల యోడలను కూడ పట్టుకొనవచ్చును.

శత్రువుల సరకులు, వారియోడలమీదనే తీసికొని పోబడుచున్నపుడు, ఆ యోడలను సరకులను కూడ పట్టుకొన వచ్చును. వారిసరకులు తటస్థరాజ్యముల యోడలమీద తీసికొనిపోబడినపుడు, ఓడలను వదలివేసి, సరకులను పట్టు కొనిపోవు ఆచారము పూర్వముకలదు. ఆ యోడల కేవునష్ట మునుకూడ యుద్ధము లిచ్చుకొనుచుండిరి. సముద్రము మీద నుండి జరుగుచున్న ముట్టడిని తప్పించుకొన బ్రయత్నించు తటస్థఓడలను మాత్రము పట్టుకొనుచుండిరి. ఇదియే నేటికిని, యింగ్లాండు అమెరికావారల నీతి సూత్రము. కాని యీ యాచారము యిటీవలమారుచున్నది. తటస్థనావలమీదనున్న శత్రువుల సరకులను పట్టుకొనగూడదను నీతి సూత్రమును 16 వ శతాబ్దమునుండి బలపరచుచురాగా, 1856 వ సంవత్స రపు పారిసు కాన్ఫరెన్సులో స్థిరపడి, అన్నిరాష్ట్రముల వారును దాని నంగీకరించి ఆచరణలోనికి తెచ్చిరి. అమెరికా వారు మాత్రము దీనిని స్పష్టముగ నామోదించకపోయి నను, 1864 వ సంవత్సరములో జరిగిన తమ యంతఃకలహము లోను, 1898 వ సంవత్సరములో స్పెయినువారితో జరి

గిన యుద్ధములోను, ఈ నీతిసూత్రమునుబట్టియే నడచు కొనిరి. ఈసూత్రమునకు రెండు నిషేధములున్నవి. సముద్రముమీదనుండి, యుద్ధతులు తమశత్రువుల దేశములను ముట్టడించినపుడు యీతటస్థనావలు, ఆముట్టడిని తప్పించుకొని పోజూచినపుడును, శత్రువులకు యుద్ధసమయములో మిక్కిలి యవసరమగు వస్తువులను తీసికొనిపోవుచున్నపుడును యీనావలను, వీనిమీదనుండు సరకులను పట్టుకొనవచ్చును. శత్రువుల యోడలమీదనుండు శత్రువుల సరకులను అవశ్యము పట్టుకొనెదరుగాని, వారిప్రజల వినోదముల కక్కరవచ్చు చిత్తరువులు, గ్రంథములు, విగ్రహములు, ఆసుపత్రులలో కావలసినమందులు మొదలగునవి పట్టుకొనుట న్యాయము కాదని చెప్పెదరు.

ఒక శత్రునావనుపట్టుకొన్నపుడు, దాని కెప్తాను కొంత సొమ్ము యిచ్చుకొనుటకు ఒప్పుకొని, ఒక దస్తావేజును వ్రాసి యిచ్చి, తనదారినితాను పోవచ్చును. ఈదస్తావేజును (Ransom bill) అనిచెప్పెదరు. ఈబిల్లు నిచ్చినపు డేర్పరచుకొన్న మార్గము ననుసరించియే నియమితకాలములో శత్రునావ తన గమ్యస్థానమునకు పోవలయును. ఈబిల్లు కాపీయొకటి శత్రునావ కెప్తాను తనవద్దనుంచుకొనును. తగినకారణములేకుండ మధ్యమార్గములో ఆలశ్యము చేసినయెడల, ఆ యోడను తిరిగి పట్టుకొనవచ్చును. అప్పుడాయోడను విక్రయించి క్రయధనములోనుండి మొదట పట్టుకొన్న వారికీయవలసిన

సొమ్ము నిచ్చివేసి, మిగతసొమ్ము రెండవసారి పట్టుకొన్నవారు తీసికొనవలయును. మొదట పట్టుకొన్నవారివలన ఆ యోడ యజమానుల దేశమువారే తిరిగి దానిని లాగుకొన్నయెడల దస్తావేజుప్రకారము సొమ్ము నీయవలసిన పనిలేదు. ఇట్టిదస్తావేజులను తీసికొనగూడదని ఆంగ్లేయకోర్టులు తీర్మానించినవి కాని, అమెరికావారును, ఫ్రెంచివారును తమ యుద్యోగస్థుల కిట్టియధికారముల నొసంగియున్నారు.

నడి సముద్రముమీద గాని, తమ రేవులలోగాని, ఒక నావను శత్రువులు పట్టుకొన్న తరువాత, తిరిగి వారివద్దనుండి దానిని తీసికొన్నపుడు, దానిపూర్వపు యజమానులకే యీయబడును. దీనిని తిరిగి పట్టుకొనకపూర్వము శత్రువులు యుద్ధనావగమార్చినయెడల, పూర్వయజమానుల కీయబడదు. తిరిగిపట్టుకొన్నవారికే చెందును. యుద్ధతులలో నొకరు తటస్థ నావను పట్టుకొన్నతరువాత, వారిశత్రువు దానిని స్వాధీనము చేసికొన్నయెడల, తటస్థులకే వదలివేయబడును. ఈ నావను జప్తుచేసి యేలము వేయించగల సంగతిసందర్భములలో పట్టుబడినయెడల, దానియజమాని తిరిగి పట్టుకొన్న వానికైన ఖర్చులను, కొంతబహుమతియు నిచ్చి, స్వాధీనపరచుకొనవలయును. ఇట్లు తిరిగి పట్టుబడిన నావలు, పట్టుకొన్న దేశస్థులవే యైనయెడల, వానియజమానులు, పట్టుకొన్న వారికి తమ దేశనిబంధనల ప్రకారము యేర్పడిన సొమ్మునిచ్చి వానిని స్వాధీనము పరచుకొనవలయును.

యుద్ధతులు, నావికాయుద్ధములలో తమ హక్కులను కాపాడుకొనుటకు సముద్రములో ప్రయాణము చేయుచున్న యితరదేశ నావలను సోదా చేయుచుండవచ్చును. ఆ నావలకు సంబంధించిన కాగితములను, వానిలోనుండు సరకులను సోదా చేయుదురు. ఇట్లు వానిని శోధించుటకు కొంతకాలము ప్రయాణము చేయుకుండ నాపుట యావశ్యకము. ఇవి వర్తకపుటోడలుగాక పరరాజుల స్వంతయోడలైనయెడల సోదా చేయకూడదు. వీరి పౌరుల యోడలను సోదా చేయవచ్చును. యుద్ధరాష్ట్రప్రభువులవలన సోదా చేయు నధికారముగల ఓడ కెప్తానులు మాత్రమే తటస్థఓడలను సోదా చేయగలుగుదురు. వీరి సోదాకు అడ్డు జేసినయెడల ఆయోడలును, వానిలో నుండు సరకులును పట్టుకొని యేలము వేయుదురు. శత్రువుల వర్తకపుటోడలు సోదాకు ఆటంకము కలిగించి యుద్ధమునకు డీకొని ఓడిపోయి పట్టుబడినయెడల, వానికిగల పూర్వపు హక్కులు పోయి విరోధి యిష్టప్రకార ముపయోగింపబడును. తటస్థరాజ్యముల వర్తకపుటోడలు యుద్ధతుల నెప్పటికిని యెదిరించి వారితో పోరాటము చేయకూడదు. ఒకవేళ యవి జయించినను, వాని దేశప్రభువులకు తెలియఁజేసి, వారిచేత శిక్షింపించుటయేగాక, యుద్ధతులు తగిన పరిహారమును కూడ బడయుదురు. తటస్థరాజ్య యుద్ధనావలనుమాత్రము యుద్ధతు లెన్నడు సోదా చేయకూడదు.

12, 13

శత్రునావ యొకప్పుడు బావుటా లేకుండగను, మరి యొకప్పుడు విదేశబావుటాల నెత్తికొనియు, పరరాష్ట్రనావలను తరుముచుండును. సోదా చేయు సమయము రాగానే, తన నిజమైన బావుటాను ధరించవలెను. తరుమబడు నావలో అనుమానాస్పదమైన కాకితములు దొరకినయెడల దానిని ఆపివేసి, దానిలో నుండువారిని ఖైదీలనుగ తీసికొనిపో వచ్చును. దాని చర్యను విచారించుటకు దానిని తరిమి పట్టుకొన్న యుద్ధతుల కోర్టుకు తీసికొనిపోవలెను. దానిని పట్టుకొనుట న్యాయమేయని కోర్టువారు యెంచినయెడల, దానిని విక్రయించి క్రియమొత్తమును పూర్తిగగాని, కొంత భాగముగాని పట్టుకొన్నవారి కిచ్చెదరు. పట్టుకొనుట న్యాయము కాదని తీర్పు చేసినయెడల దానిని వదలివేయుదురు. దురుద్దేశముతో, అకారణముగ దానిని పట్టుకొన్నయెడల దానికైన ఖర్చులు, నష్టము పట్టుకొన్న యోడకెప్తానువలన యిప్పించెదరు.

శత్రునావలనుగాని, తటస్థనావలనుగాని యుద్ధతులు పట్టుకొన్నపుడు అట్లు పట్టుకొనుట న్యాయమా కాదాయను విషయమును విచారణ చేయుటకు యుద్ధతుల దేశములలో కోర్టు లేర్పరుపబడియుండును. వీనిని ప్రైజుకోర్టులని పిలచెదరు. యుద్ధతుల సేనలు శత్రువుల యోడలను పట్టుకొనుట, తమ దేశముకొరకుగాని స్వలాభమునకు గాదు. తమరు పడిన కష్టమునకు న్యాయనిబంధనలప్రకారము పట్టుకొన్న ఆస్తి

గాని, లేక దానిలో కొంతగాని పుచ్చుకొనవలసియుండును. తటస్థరాజ్యములలో యుద్ధతులు ప్రైజుకోర్టులను స్థాపించ గూడదు. ఈకోర్టుల న్యాయాధిపతులు అంతర్జాతీయ రాజ్య తంత్రనీతిసూత్రముల ననుసరించి తీర్పు లిచ్చుచుందురు. వీరు న్యాయబుద్ధితో పక్షపాతరహితముగ తమదేశప్రభువులు యుద్ధతులని మరచిపోయి, తీర్పులు చెప్పుదురు. ఏవిషయములోనైనను తమ దేశము చట్టము లేర్పరచినయెడల వానిప్రకారము తీర్పులు చెప్పక తప్పదు.

ప్రతివర్తకపుటోడయు తాను యేదేశమునకు చెంది యున్నదియు, తన సరకును యెచ్చటనుండి యెచ్చటకు తీసి కొనిపోవుచున్నదియు తెలియుటకు కొన్ని నిదర్శనముల నుంచుకొనవలయును. ఆయోడ యే మార్గముగ యెక్కడెక్కడకు బోవునో, నావికుల చహరా, సరకుల సెగుమతి దారుల కంట్రాక్టులు, యీ మొదలగునవి కనపరచు దస్తావేజులు ప్రతియోడయందును ఉండవలెను. వీనిలో యేయే దస్తావేజు లుండితీరవలయునో, ఆయా దేశముల నిబంధనల ననుసరించియుండును. ఆ కాకితములు లేనియెడల లేక అబద్ధపుకాగితము లుంచుకొన్నయెడల, లేక ఉన్నవానిలో పరస్పరభేదములు కనబడినయెడల, యుద్ధతులు తటస్థరాజ్యముల యోడలను సహితము పట్టుకొనవచ్చును.

తటస్థరాష్ట్రకోర్టులకు యుద్ధతులు పట్టుకొన్న ఓడలనుగురించిగాని, సరకులనుగురించిగాని తీర్పులు చెప్పుట

కధికారము లేదు. ఈ సూత్రమునకొక నిషేధము కలదు. తటస్థరాజ్య సముద్రతీరములలో యుద్ధతులు, శత్రువుల ఓడలను పట్టుకొన్నప్పుడుగాని, లేక తటస్థరాజ్యములో సైన్యములను ఫిరంగులను యెక్కించుకొని శత్రువుల యోడలను పట్టుకొని ఆ తటస్థరాజ్యమునకే తీసికొనివచ్చినప్పుడుగాని, దాని రాజ్యాధికారమును ధిక్కరించిన దగుటచేత, ఆ తటస్థ రాజ్యములో యీ విషయమై విచారణ చేయవచ్చును.

తటస్థనావలు, సరకులు న్యాయముగ పట్టుకొనబడినవా యను విచారణ పట్టుకొన్న యుద్ధతుల రేవులకుగాని, యుద్ధములో వారి స్నేహితుల రేవులకుగాని తీసికొనిరాబడినపుడే, ఆరంభింపబడును. తటస్థ రేవులకు తీసికొని రాబడినపుడు ఆరాజ్యము వారి యంగీకారమును తీసికొని, అక్కడనే విచారణ ప్రారంభించవచ్చును. సాధారణముగా నిట్లు జరుగుటకు తటస్థరాష్ట్రములు ఒప్పుకొనవు. పట్టుబడిన ఓడలు, సరకులును శత్రువుల వైనయెడల వానిని ముంచి వేయవచ్చును. వీలున్నయెడల తీసికొనిపోవచ్చును. మొన్నటి యుద్ధములో జర్మనీయోడయగు ఎమ్డెన్, ఆంగ్లేయనావల ననేకము ముంచివేసినది. తటస్థుల ఆస్తియైనయెడల దానిని పట్టుకొన్నవారు తమ ప్రైజు కోర్టులకు సాధ్యమైనంత త్వరగా తీసికొనిపోవుచుండవలయును. నిషేధవస్తువులుతప్ప తక్కిన సరకులు శత్రుదేశపు రాజుల వైనను సరే, తటస్థుల వైననుసరే, పట్టుకొనగూడదని మున్మందు అన్ని రాజ్య

ములవారును యేర్పరుచుకొన్న నేతప్ప, పట్టుబడినవారిని తీసి కొనిపోవుటకు వీలులేనపుడును, శీఘ్రకాలములో శత్రువుని సాధించవలెనన్నపుడును, వానిని పట్టుకొన్నవారు నడిసముద్రములో ముంచివేయుచునేయుందురు.

శత్రురాష్ట్రపౌరుల యోడలను సరకులను యుద్ధసమయములో పట్టుకొనగూడదని అమెరికా రాష్ట్రమువారును, యూరపుఖండములో ననేక శాస్త్రజ్ఞులును, రాజనీతినిపుణులును, కొన్నిచిన్న రాష్ట్రములును అభిప్రాయపడుచున్నారు. కాని, రష్యావారును, ఫ్రాన్సువారును తమకు యింగ్లాండుతో యుద్ధము సంభవించినపుడు యీ యీయుధము నుపయోగించినగాని దానిని జయించుట కష్టమని యెంచి యీ రాజనీతి సూత్రమును ఒప్పుకొనుచుండలేదు. ఇంగ్లాండువారు 19 వ శతాబ్దములో ఫ్రాన్సువారితో యుద్ధము చేసినపుడు ఫ్రెంచివారి నావికాబలమును ధ్వంసము చేయుటయేగాక వారికిగల పదిలక్షల టన్నుల నోడలకు తమ నావికాబలముతో చేర్చుకొనిరి. ఈ కారణముచేత, ఆంగ్లేయప్రభుత్వమువారును వారి ప్రజలును తమ సంరక్షణకంటె ప్రతికక్షుల వర్తకమును ధ్వంసము చేయుటే ముఖ్యమని యెంచుచున్నారు. ఇటీవల ప్రకృతిశాస్త్రములు, యుద్ధములలోను, వర్తకములలోను అనేకమార్పులు కలిగించినవి. ఇంగ్లాండులో కూడ, జనసంఖ్యయు, చేతిపనులును అభివృద్ధి యైనకొలది, దాని యార్థికతత్వముకూడ మారిపోయినది. తనకు కావల

సిన గోధుమలును తన యంత్రశాలలలో వివిధవస్తువులను తయారుచేయుటకు కావలసిన పదార్థములును యితరరాష్ట్రి ములనుండి రావలయును. తాను చేసిన వస్తువులను బయ టకు పంపవలయును. నడిసముద్రముమీాద తన వర్తకపు టోడలు శత్రువుల అతివేగమైన నావలచేత ధ్వంసము చేయ బడుటయేగాక, తన వాణిజ్య మంతరించి దేశములో జనులకు కడుపునిండ ఆహారముకూడ దొరకక యింగ్లాండు నావికా బలముగల యితరరాష్ట్రిములకు పాదాక్రాంతురాలు కావ లసివచ్చును. గతయుద్ధములో యెమ్డెన్‌వంటి యోడలు కనీ సము యిరువదింటిని జర్మనీవారు నడిసముద్రములో త్రిప్పు చుండినయెడల, ఆంగ్లేయ నావికాబలమంతయు వానిని తరముచున్నను, ఆంగ్లేయుల వర్తకమునకు మిక్కిలి హాని సంభవించియుండును. తన విరోధులైన యూరపు రాష్ట్రిము లకు తన నావికాదళమువలన కొంత యిబ్బంది కలుగజేయ వచ్చునుగాని, యింతమాత్రముచేత వానిని లోబరచుకొన లేదు. వారి ఓడవర్తకమును ధ్వంసము చేయవచ్చునుగాని వారు యితరరాష్ట్రిములగుండ సరకులను తెప్పించుకొనకుండ చేయ లేదు. గత యుద్ధములో జర్మనీవారికి యోడవర్తకము బొత్తిగ లేకుండఁజేసిరిగాని వారు తటస్థరాజ్యములగుండ కావలసిన సరకులను తెప్పించుకొని, చాలాకాలము యుద్ధ మును నడపగలవారైరి. ఇప్పుడు యింగ్లాండు వారికి ఒకకోటి టన్నుల నావలమీాద వర్తకము జరుగుచున్నది. విదేశములతో

వారి వర్తకము సంవత్సరమునకు 110 కోట్ల పౌనుల ఖరీదు గలదైయున్నది. ఇదిగాక, పూర్వకాలములో తటస్థఓడల లోని శత్రువుల సరకులను పట్టుకొనుచుండెను. కాని 1856 వ సంవత్సరములో జరిగిన సంధివలన అట్లుచేయుటకు వలను బడదు. కాబట్టి యింగ్లాండు యొక్క విరోధులు తటస్థనావల మీాద స్పష్టముగా నిషేధింప బడినవి గాక తక్కిన పదార్థము లన్నియు తెప్పించుకొనవచ్చును. ఈ నిషేధింపబడిన వస్తువులుగూడ తటస్థరాజ్యములుగుండ దిగుమతి చేసికొనవచ్చును. కాబట్టి శత్రువుల వర్తకము నణచివేసినంత మాత్రమున దానిని తటస్థుల స్వాధీనము లోనికి పోనీయవచ్చును. గాని ఆ శత్రువులను యింగ్లాండు వారు లోపరుచుకొనుట మిక్కిలి దుర్లభము. శత్రుపౌరుల సరకులను ఓడలను పట్టుకొనుట అన్యాయమని అనేక శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

---

## అధ్యాయము V

---

### (Weapons of war made of warfare.)

యుద్ధోపకరణములు. యుద్ధ ధర్మములు.

యుద్ధతుల నావికాసైన్యము, పదాతులు, గుఱ్ఱపు దళములు మొదలగు వానిలో చేరిన వారును యుద్ధము చేయుటకు సంపూర్ణముగ తయారైన వాలంటియరు సైన్యములో

చేరినవారును యుద్ధములో చేరియుందురు. మిలిటరీ శిక్షకు లోబడక, కొందరు జనులు గుంపులుగకూడి శత్రువులను బాధించుటయు, వారిని తమ యిష్టమువచ్చినటుల దోచుకొనుటయు, వానివలన తీసికొన్న ధనమును వస్తువులను తమ స్వంతమున కుపయోగించుకొనుటయు, యీన్యాయశాస్త్రమునకు విరోధము. ఇట్టివారు శత్రువులను బాధించి తమప్రభుత్వము వారి కెంత యుపకారము చేయుచుండినను, వీరు జరిగించు కార్యములకు మెవరికిని జబాబుదార్లు కాకపోవుటచేత వీరిని యుద్ధతుల సేనలలో చేరకూడదని పెద్దరాష్ట్రిములును, చేర్చుకొనవచ్చునని చిన్నరాష్ట్రిములును 1874 వ సంవత్సరములో జరిగిన బ్రస్సేల్సు కాన్ఫరెన్సులో చర్చచేసినవి. తుదకు యీక్రింది విధముగ తీర్మానములు చేయబడినవి. (1) ఈ గుంపులకు ఒకజవాబుదారీ చేయుగల అధిపతి యుండవలెను. (2) ఈ గుంపులలో చేరినవారికి దూరముగనుండి కనపడేలాగున దుస్తులు మొదలగు గుఱుతులుండవలెను. (3) వీరు బహిరంగముగ ఆయుధపాణులై యుండవలెను. (4) యుద్ధ సమయములలో నుండవలసిన రణనీతి ప్రకారము నడచుకొనవలయును.

ఒక దేశములో నుండు జనులనందరిని యుద్ధ సన్నద్ధులు కావలసినదని ప్రభువు లాజ్ఞనొసంగి వారిని తమ సైన్యములో చేర్చుకొనవచ్చును. 1914 వ సంవత్సరములో జర్మనీ దేశములో యిట్టివారు యేబదిలక్షలమంది యుద్ధ నైపుణ్య

మును కలిగి దేశ సైన్యములో చేర్చుకొనబడుటకు యెల్లపుడు సిద్ధముగనుండిరి. అడవిజాతులనుకూడ సైన్యములో చేర్చుకొని న్యాయశాస్త్ర ప్రకారము వారిచేత యుద్ధము చేయించ వచ్చును.

చారులను శత్రుసైన్యములోనికిని వారిరాజ్యములోనికిని బంపి వారి రహస్యములను తెలిసికొనవచ్చును. ఈ గూఢాచారత్వము గౌరవమైన యుద్యోగముగనే యెంచవలయును గాన వీరు శత్రువులచేత పట్టుబడినపుడు ఖయిదీలనుగ తీసికొని పోబడవలెనుగాని చంపబడగూడదు. తమదేశమును పరులపాలు చేయవలెనను దేశద్రోహులు కొందఱు తమ దేశములోని రహస్యములను శత్రువులకు వెల్లడిచేసినయెడల వారి ప్రభువులు చంపివేయుట యుక్తమే. శత్రువుల రహస్యములను తెలిసికొనుటకు తమ ప్రాణము నర్పించువారు శత్రువుల చేతులలోబడి మృతిపొందినను, గుండుదెబ్బ తగిలి చనిపోయినవారి గౌరవమునే సంపాదించు కొనెదరుగాని, వారికి న్యూనత యేమియు కలుగబోదు.

అమెరికా మొదలగు దేశములలో వర్తకపుటోడలకుకూడ తమ నావికాబలమువలెనే, శతృవులతో యుద్ధము చేయుటకు అంగీకారము నొసంగి వానికి ఒక దస్తావేజువ్రాసి యిచ్చెదరు. ఇట్టి దస్తావేజులు (Letters of Marque) తమ దేశస్థులకేగాక, తమ తరఫున యుద్ధము చేయుటకు యితర దేశ నావికులకుకూడ యీయబడుచుండెను. వీరందరు శత్రు

నావలను పట్టుకొని దోపిడి చేయుటకు మొదలుపెట్టగా 19వ శతాబ్దారంభమున తటస్థనావల నిట్లుపయోగించకూడదని యేర్పాటుచేయబడినది. కాని అమెరికావారు తమ దేశీయుల నావలను శత్రువులమీాద యుద్ధము చేయుటకు అంగీకరించకుండ నుండవలెనన్న తమ దేశపు వర్తకపుటోడలను దానిమీాదనుండు తమ సరకులను తమతో యుద్ధము చేయువారు పట్టుకొనకుండ నుండవలెనని చెప్పుచున్నారు. యూరపుఖండములోమాత్రము రెండవ విషయమును ఒప్పుకొనక, మొదటివిషయమునుమాత్రము గమనించుచున్నారు. అమెరికావారు నిషేధవస్తువులుతప్ప తమ వర్తకపు నావలలోనే దేశస్థుల సరకులనుగాని యుద్ధతులు పట్టుకొనగూడదని కఠినముగ వాదించుచు, ప్యారిసుసంధిలో దస్కతు చేయుటకు నిరాకరించిరి. కాని తమ వర్తకపుటోడలను తమ తరఫున యుద్ధముచేయ నిచ్చు ఆచారమును 1856వ సంవత్సరమునుండియు వదులుకొనిరి.

వర్తకపుటోడలనుకూడ, వాని యజమానులవలన అద్దెకు తీసికొని, నావికాదళములో కలుపుకొని, వాని సహాయముతో యుద్ధము చేయవచ్చును. 1887వ సంవత్సరములో ఆంగ్లేయులును, 1892వ సంవత్సరములో అమెరికావారును కొన్ని కంపెనీల స్టీమర్లను సంవత్సరమునకు కొంత సొమ్ము యిచ్చే పద్ధతిమీాద యుద్ధసమయములలో కొనుటకుగాని, అద్దెకు తీసికొనుటకుగాని, వారితో ఒడంబడికలు చేసికొని

యున్నారు. భూమిమీద వాలంటియరుకోరువలె, సముద్రము మీద నిట్టి వాలంటియరు నావికాదళమును యేర్పాటు చేసి కొనుట ప్యారిసుసంధికి విరోధ మేమియు లేదు.

దొంగతనముగా వచ్చి, శత్రువులను చంపకూడదు. చంపబోవునపుడు తన నిజరూపమును, దుస్తులను దాల్చి శత్రువును చంపుటకు ప్రయత్నము చేయవలెను. ఒకడు శత్రు శిబిరములో రహస్యముగ బ్రవేశించి శత్రుసైన్యాధిపతిని గాని, శత్రురాజునుగాని, తన కుండవలసిన దుస్తులతో పోయి అకస్మాత్తుగ వారిపై బడి చంపినను తప్పు కాదు. కాని తాను బాటసారిసని శత్రువుల నమ్మించి, వారి శిబిరములో ప్రవేశించి యేమరిపాటుననున్న శత్రువును రహస్యముగ చంపివేయుట నీతిబాహ్యమైన పని. ఇట్లు చేసినవాడు కూనీ చేసిన క్లైంచబడి ఉరి దీయబడును.

శత్రువులు తినుచున్న తినుబండారపు పదార్థములలో గాని, వారు త్రాగుచున్న నీళ్లలోగాని విషము కలుప కూడదు. విషముతో పొదిగిన బాణములను ప్రయోగించ కూడదు. అనవసరముగ బాధను కలుగఁచేయు మేకులు, చిల్లపెంకులు, అద్దపుముక్కలు, చాకులు, యిత్తడి గుండీలు మొదలగు వస్తువులను దట్టించిన ఫిరంగులను ప్రేల్చకూడదు. జనులు తండోపతండములుగఁ జచ్చునట్లు బాంబులను టార్పీడోలను ప్రయోగించవచ్చునుగాని, అనవసరముగ బాధను కలిగించువానిని ఉపయోగించకూడదు.

శత్రుదేశమును దండెత్తినపుడు, దేశ మంతయు ధ్వంసము చేయకూడదు. దానిలోని ఆస్తిని, దాని వర్తకమును సంరక్షించవలయును. యుద్ధసంబంధమైన పనులకు కావలసియున్నపుడు చెట్లుచామలను, గృహములను, గ్రామములనుకూడ నాశము చేయవలసివచ్చును. శత్రువులు తరుమకుండ, గ్రామములను పాడుచేసి, వంతెనలను పడగొట్టి రైలు పట్టాలను పెరికివేయవచ్చును.

శత్రువును తమదేశమునుండి వెడలగొట్టుటకు ఒకప్పుడు ఆదేశమువారే దానిని పాడుచేయవలసివచ్చును. 1812 వ సంవత్సరములో నెపోలియన్ యొక్క సైన్యమంతయు నిలువ నీడలేక చలిచేత చచ్చుటకు రష్యావారు, తమ మాస్కోనగరమును తగులబెట్టుకొనిరి. స్వాతంత్ర్యమునకై స్పెయినువారితో అనేక సంవత్సరములనుండి పోరుచుండిన డచ్చివారు తమదేశమునుండి శత్రువులను పారదోలుటకు గట్లను తెగగొట్టి సముద్రవెల్లువలను లోపలికి రానిచ్చి దేశమును ముంచివేసికొనిరి. శత్రుకోటలను ముట్టడించుటలో కూడ గుళ్లను, వైద్యశాలలను, వస్తుప్రదర్శనశాలలను, పుస్తకభాండాగారములను నష్టపరచకుండ ప్రయత్నించవలెను. యుద్ధములో మోసము నుపయోగించవచ్చును. కాని శత్రువుల బావుటాను వేసికొని వారిని సమీపమునకు రప్పించి అకస్మాత్తుగ వారిమీద పడుట ద్రోహముకాని న్యాయమైన యుద్ధముకాదు. ఈవిధముగనే, తుపాకీమందు గిడ్డంగులమీద

(Red cross) జండాను వేయుట ఆపదలోనున్నట్లు నటించి తెల్లబావుటాను వేసికొని, శత్రుసమీపమునకు రాగానే వానిపై బడుట లోబడుటకు రాజీపడుటకు యేర్పాటుచేసికొనుచు మెల్లగ తమసైన్యమును అపాయమునుండి తప్పించుట— యిట్టిమోసములు చేయకూడదు. ఒక యుద్ధనావ దొంగబావుటాలను వేసికొని, శత్రుఓడను సమీపించగనే, తన నిజమైన జండానుధరించి దానిని కొట్టవచ్చును. అలాగుననే, సైనికులు దొంగదుస్తులు వేసికొని విరోధిసైన్యమును రహస్యముగ సమీపించి, యుద్ధముచేయకపూర్వము తమరు శత్రువులైనటుల కనపరచు చిహ్నములను ధరించవలెను.

---

## అ ధ్యా య ము VI

---

### (Peaceful relations of belligerents)
### యుద్ధతుల అవిరోధసంబంధములు

యుద్ధము జరుగుచున్న కాలములోకూడ యుద్ధతులకు అనుకూలమైన అన్యోన్య సంసర్గములు అప్పుడప్పుడు కలుగుచుండక తప్పదు. దీనికి కొన్ని యుదాహరణముల నిచ్చెదను.

(1) Flags of truce:—యుద్ధతు లొకరితో నొకరు సంధినిగురించి సంభాషించుటకు తెల్లబావుటాల నెత్తెదరు.

ఈ తెల్లజండాలను వేసికొనివచ్చినవారిని పట్టుకొని ఖైదీల నుగ చేయకూడదు. ఏవిధముగను వారి కపాయము కలుగఁ జేయకూడదు. వీరికన్నులకు గంతలుకట్టి శత్రుశిబిరములో నుండి పోవునట్లు చేయవచ్చును. ఒకప్పుడు శత్రురహస్యములు వీరికి తెలియజేయుట సంభవించినపుడు యుద్ధము ముగియు వరకు వీరిని శత్రుసైన్యములో గౌరవముతో నుంచవచ్చును. తెల్లజండాతో వచ్చినవారు ద్రోహముగ ప్రవర్తించుట కుద్దే శించినట్టు కనబడినయెడల వీరిని పట్టుకొని శిక్షించవచ్చును. శత్రుసైన్యవ్యూహములయొక్కయు, కోటలయొక్కయు ప్లాను లను సంపాదించుటగాని, శత్రుసైన్యములను రాజద్రోహము నకు పురికొల్పినగాని, వీరిని ఖైదీలనుగ తీసికొనెదరు. ఒక ప్పుడు ఉరిదీయుటకూడ కలదు.

(2) Cartels:—యుద్ధసమయములలో కొన్ని యవిరోధ సంబంధమగు పనులను జరిగించుటకు యుద్ధతులమధ్య జరుగు ఒడంబడికలను, (Cartels) అని చెప్పుదురు. ఉభయుల మధ్యను, కొద్దికాలమున కేర్పరుచుకొను సంధు లెట్లు జరుగ వలెనో ఉభయుల ఖైదీల నెట్లు మార్చుకొనవలెనో, తపాలా, తంతివార్త లెట్లు జరుగుచుండవలెనో, యీ మొదలగు విష యములు యీ ఒడంబడికలలో నుండును. శత్రువులనొద్ద ఖైదీలుగనున్న తమవారిని తమయొద్దనున్న శత్రువుల ఖైదీలను మార్పుడు చేసికొనుటకు, తమ యుద్యోగస్థులను (Commissaries) శత్రురాజ్యములో నుంచెదరు. ఇట్లు

మార్చబడిన ఖైదీలను తీసికొనిపోవు ఓడలను Cartel ships అని పిలచెదరు. వీనిని శత్రువులు పట్టుకొనగూడదు.

(3) Passport Safe Conducts:—ఇవి శత్రు పౌరులను తమ దేశములో ప్రయాణముచేయుటకు యుద్ధతు లొసంగు అంగీకారములు. యుద్ధత రాజ్య ప్రభుత్వమువారు గాని, వారి సేనానాయకులుగాని, తాత్కాలికముగ కొందరి కిచ్చునట్టి యంగీకారములు safe conducts అని చెప్పెదరు. ఒక స్థలమునకు పోవుటకు మాత్రము యివి యీయబడును. తగిన కారణము లున్నయెడల, యీ యంగీకారములను రద్దు చేయవచ్చును. కాని అట్లు రద్దుచేయగానే, అంగీకారమును పొందియున్నవారిని తమ దేశమునుండి సురక్షితముగ పంపి చేయవలయును. ఈ యంగీకారములను పొందినవారు, యితరులకు వానిని పరివర్తన చేయకూడదు.

(4) Licenses to Trade:—యుద్ధతులు తమ శత్రువులకు, తమ దేశములో వర్తకము చేసికొనుటకు లైసెన్సుల నిచ్చుచుందురు. ఒకప్పుడు వారిలో కొందరికి మాత్రమే అట్టి లైసెన్సుల నిచ్చెదరు. లైసెన్సుల నిచ్చినవారి దేశములో కంట్రాక్టులమీద వ్యాజ్యములు వేసికొనవచ్చును. కొన్నివస్తువులలోగాని, కొన్ని దేశ విభాగములలోగాని వర్తకము చేసికొనవచ్చునను యంగీకారమునకు విరుద్ధముగ ప్రవర్తించిన యెడల సదరు అంగీకారము రద్దుచేయుదురు.

(5) Capitulations:—ఒక కోటనుగాని, ఒక సేనను గాని, శత్రువునకు స్వాధీనము చేయుటకు కొన్నిషరతులను ముందుగా నేర్పాటు చేసికొనెదరు. లోబడినవారి ప్రాణము లను రక్షించుట మొదలుకొని వారు జయ జయధ్వానము లలో ఆయుధ సామగ్రితో వెడలిపోవుటకు సమ్మతించు వరకు, అనేకవిధములగు షరతులు అప్పటి సంగతిసందర్భము లనుబట్టి జరుగుచుండును. లోబడబోవువారు పడుచున్న బాధ లను బట్టియు, ముట్టడించిన శత్రువుల అవసరములను బట్టియు, యీ షరతులు మారుచుండును. ఒకప్పుడు రక్షణచేసుకొను చున్న సైన్యముయొక్క శౌర్యమునకు సంతోషించి, వారికి గౌరవసూచకముగ మంచిషరతు లీయబడవచ్చును. తనస్వాధీ నములోనున్న దేశమునుగాని సైన్యమునుగాని ప్రతిసైన్యాధి పతియు తన యవసరమునుబట్టి శత్రువుల షరతులకు లోబడి స్వాధీన పరచవచ్చును. యుద్ధముజరుగుచున్న యితరదేశ విభాగములనుగాని సైన్యమునుగాని లోబరచవలెనన్న తనపై యధికారి యంగీకారములేనిదే, అట్లు చేయజాలడు. రాజ కీయవిషయములలో యీ సేనాధిపతు లెంతమాత్రము జోక్యము కలుగఁజేసికొనగూడదు.

(6) Truces and Armistices:—యుద్ధము జరుగు దేశమందంతటనుగాని, కొంత దేశవిభాగములోగాని, నియ మితకాలమువరకు యుద్ధము నాపివేయునటుల యుద్ధతుల మధ్య ఒడంబడికలు జరుగుచుండును. వీనిని Truces అని

వాడెదరు. నిర్దిష్టమైన స్థలములలో మృతిబొందినవారిని పాతి వేయుట మొదలగు పనులను నెరవేర్చుకొనుటకు ఉభయ సైన్యములు కొద్దికాలము యుద్ధమాపుకొను నేర్పాటులు Armistices అని చెప్పెదరు. ఈ సంధి సమయములలో ఉభయసేనలు బలమును కూర్చుకొనవచ్చును. శత్రువుల కోట లలో పగుళ్లుపడినపుడు వానిని సంధిసమయములలో బాగు చేయకూడదుగాని లోకోటలను బాగుచేసికొనవచ్చును. ముట్టడించబడిన కోటలోని సైన్యమునకు తగినంత తినుబండా రములను పోసీయవచ్చును. 1871 వ సంవత్సరములో ప్యారిసు పట్టణమును జర్మనులు ముట్టడించినపుడు సంధిప్రయత్నములు జరుగుచున్నకాలములో వానిని బొత్తిగ పోసీయలేదు.

---

# అధ్యాయము I

## తటస్థులయెడల యుద్ధతుల విధులు.

## Duties of Belligerents towards Neutrals

(1) తటస్థరాజ్యములలో యుద్ధముచేయకుండుట—ఏరాజ్యముగాని బుద్ధిపూర్వకముగ తటస్థరాజ్యములో యుద్ధప్రయత్నములు చేసినయెడలగాని, లేక తనయుద్యోగీయు లట్లుచేసినపుడు, తగిన క్షమాపణయు పరిహారము నొసంగనపుడుగాని, నాగరిక రాజ్యములన్నియు దానిని చివాట్లుపెట్టకమానవు. యుద్ధతులు శత్రునావలను నడిసముద్రములోనుండి తరుము చున్నపుడు అవి తటస్థరాజ్యతీరములకు చేరగనే, వానిని పట్టుకొనగూడదు. కాని స్వసంరక్షణకు తప్పని సరియైనయెడల తటస్థరాజ్యములవారి తటస్థతకు కొంతభంగము కలిగించవచ్చును. ఇట్లు జరిగించినరాష్ట్రము, తనపని ముగిసిన తరువాత తటస్థరాజ్యమునకు క్షమాపణఁజేసి తీరవలయును. చేసినపని తప్పైఅయినను ఆతటస్థ రాజ్యముకూడ, తృప్తికరమైన సముజాయిషీ యిచ్చినపుడు క్షమించవలెను. ఈ విషయము, ఒక కేజులో బాగుగ చర్చింపబడినది. 1837, 1838 వ సంవత్సరములలో, కనడాదేశములోనున్న ప్రజలు తమ ప్రభువులైన ఆంగ్లేయులమీద తిరుగబాటుచేసిరి. కనడా దేశమునకును, ఆమెరికా సంయుక్తరాష్ట్రమునకును మధ్యనున్న

నయాగరానదిలో, నేవీయను నొక ద్వీపముకలదు. ఈ దీవి మధ్యనుండి యీ రెండురాజ్యముల సరిహద్దు పోవుచున్నది. ఇంగ్లీషు ప్రభుత్వమువారిమీద తిరుగబడిన ప్రజలు యీద్వీపము నాక్రమించుకొని కారొలైను అనుఅమెరికా వారిఓడ మీదనుందు గుండుసామానులను సైన్యమును చేర్చుకొనుచుండిరి. వీరందరు కనడా దేశము మీద దుముకుటకు ప్రియత్నించుచుండగా ఆంగ్లేయసేనాధిపతి ఆయోడనుపట్టుకొని తనదేశమునకు కలిగిన అపాయమును తప్పించవలెనని తన దేశమునకు చెందియున్న నదీభాగములోనున్న ఆయోడను పట్టుకొనుటకు కొంత సైన్యమునుపంపెను. ఈలోపుగా ఆ యోడ అమెరికావారి నదీభాగములోనికి మెల్లగ జారినప్పటికి యింగ్లీషుసైన్యము దానిని పట్టుకొని నిప్పంటించి సముద్రిములోనికి త్రోసివేసినది అమెరికా ప్రిభుత్వమువారు తమ తటస్థతకు భంగము కలిగించినందుకు యింగ్లీషువారిని తగిన పరిహారము నొసంగవలసినదని యడిగిరి. బ్రిటిషువారు తమ దేశముమీద యుద్ధముచేయుటకు సైన్యము తయారగుచున్న దేశముయొక్క తటస్థతకు భంగముచేసినయెడల తప్పులేదని జవాబిచ్చిరి. ఈ వివాదము పెరిగి పెరిగి తుదకు యెట్టి నిశ్చితాభిప్రాయమునకు రాలేదు. పిమ్మట కారొలైనను పట్టుకున్న సేనలో చేరిన అలెగ్జాండరు మేక్లియోడు అను కనడాదేశస్థుడు, అమెరికాకు వచ్చినపుడు, అతను ఆయోడ పట్టుకొనుటలో ఒక అమెరికా దేశస్థుని చంపినట్లు అమెరికా

కోర్టులో విచారింపబడెను. యుద్ధములో తన సైన్యాధిపతి యాజ్ఞలకు లోబడి, అట్లు చేసినవానిని హత్యానేరముక్రింద విచారించబడగూడదనియు, వానిని వదలివేయవలసినదనియు ఆంగ్లేయప్రభుత్వమువారు అమెరికావారికి తెలియజేసిరి. ఆంగ్లేయరాయబారి, 1842 వ సంవత్సరములో అమెరికాకు పోయి, కారొలైనుఓడను తటస్థరాజ్యసరిహద్దులలో నుండగా పట్టుకొనగూడదనియు, అట్లు స్వసంరక్షణనిమిత్తము చేయవలసివచ్చినపుడు, తన ప్రభుత్వమువారు శీఘ్రముగ క్షమాపణ చేయవలసియుండెననియు చెప్పగా, దానికి అమెరికావారుకూడ సమ్మతించిరి. రష్యావారికిని జర్మనీవారికిని యుద్ధము సంప్రాప్తించబోవునపుడు, ఫ్రాన్సువారు రష్యావారితో కలసి డీకొనగా, జర్మనీవారు తటస్థరాజ్యమైన బెల్జియముగుండా ముందుగా ఫ్రాన్సువారిమీదికి దుమికిరి. అట్లు చేయనియెడల ఫ్రాన్సువారే ముందుగా జర్మనీమీదకు ఆల్సేసు లోరైనుమీదుగా వచ్చి యీ రెండు రాజ్యములకు సరిహద్దుననున్న జర్మనీవారి యుద్ధాగారములను తప్పక పట్టుకొనియుందురు. కాబట్టి తమదేశములోనే రెండువైపులను ఒక్కుమ్మడిగ ఫ్రెంచి రష్యారాష్ట్రములు యుద్ధము జరిపినయడల, దేశారిష్టమేగాక, శత్రువులను పారదోలుట మిగుల కష్టతరమై యుండునని యెంచి, జర్మనీవారు తమ స్వసంరక్షణకు తామే ముందుగా బెల్జియముగుండా ఫ్రాన్సుమీదకు పోవలసివచ్చెను. బెల్జియమువారు, జర్మనీవారి సముజాయిషీనిగాని,

వారి స్నేహరాయబారములనుగాని గమనించక, తమ తటస్థతకు భంగము కలిగించినందుకు ఫ్రెంచి ఆంగ్లేయసేనలతో కలసి యుద్ధము చేసిరి. 'యుద్ధతులమధ్య పేదలకుండ తరమే' యను కవివాక్యము యిక్కడ సార్థకమైనది. బెల్జియమురాజు తన ప్రజలతో దేశము విడిచి పోవలసివచ్చినది.

(2) తటస్థరాజ్యములలో యుద్ధప్రయత్నములు చేయకుండుట — తటస్థరాజ్యములలోగాని, దాని కంటియున్న సముద్రశాఖలనుండిగాని సైన్యమును యుద్ధతులు తయారు చేసికొని శత్రువులమీాద పడకూడదు. అక్కడ యుద్ధములో కావలసిన మందుగుండుసామానులు మొదలగువవి సేకరించుకొనగూడదు. కాని తటస్థరాజ్యములలోని రేవులవద్ద దిగిన యుద్ధతుల నావలకు పరిమాణములో కావలసిన బొగ్గు, భోజనసామగ్రి, సప్లయి చేసికొనవచ్చును. ఓడలకు అత్యావసరముగ కావలసిన మరమ్మతులు చేసికొనవచ్చును. ఒక సేన తనకు కావలసిన పదార్థములను, ఉపబలము సదా తెచ్చుకొనునట్టియు అచ్చటినుండి యుద్ధము చేయుటకు బయలుదేరునట్టియు తన కపాయము సంభవించునపుడు, పారిపోయి దాగుకొనగలట్టియు దేశవిభాగమును base of operations అని పిలచెదరు. ఈ విధముగ యుద్ధతులు ఆ తటస్థరాజ్యమునుపయోగించినయెడల వారి శత్రువులు ఆ తటస్థరాజ్యప్రభువులకు తెలియఁజేసి తగిన పరిహారమును పొందవచ్చును. ఉభయకక్షులవారికి యిట్టి సదుపాయములు సమానముగ

చేసెదమన్నను, అట్టి తటస్థరాజ్యమును క్షమించరు. దానిలో నుండి యుద్ధార్థమైన దండయాత్ర సలుపకూడదు.

1800 వ సంవత్సరములో యింగ్లాండునకును హాలెండునకును యుద్ధము సంప్రాప్తించినపుడు, ఒక యింగ్లీషు యుద్ధ నావ, తటస్థముగనున్న ప్రష్యావారి సముద్రతీరములనుండి బయలుదేరి డచ్చివారి వర్తకపుటోడలను తరిమి నడిసముద్రములో పట్టుకొన్నది. తటస్థరాజ్యములో, యుద్ధ మారంభించినటు లెంచి యింగ్లీషుకోర్టులు, డచ్చివారి నావలను వదలివేయవలసినదని తీర్పుచేసిరి. 1828 వ సంవత్సరములో పోర్చుగల్ దేశములో అంతఃకలహము సంభవించి ఒక పార్టీ వారి సైన్యము పారిపోయి యింగ్లాండు చేరినది. ఈసైన్యము యింగ్లాండునుండి దండయాత్రకు బయలుదేరగూడదని యింగ్లీషుప్రభుత్వమువారు తెలియజేయగా అట్లు చేయమనియు, నిరాయుధులైన తమ దేశస్థులను వర్తకపుటోడలలో బ్రెజీలుదేశమునకు పంపెదమనియు చెప్పిరి. 1829 వ సంవత్సరములో 700 మంది బయలుదేరి పోర్చుగల్ దేశమునకు సమీపముగ నున్నట్టియు తమ పార్టీవారి స్వాధీనములో నున్నట్టియు అజోర్సుదీవులయొద్ద దిగబోవుచుండిరి. ఇంతకుపూర్వమే వీరికి కావలసిన ఆయుధములను మరియొక యోడలో పంపివేసిరి. వీరి చర్యను కనిపెట్టుటకు యింగ్లీషు వారిచేత పంపబడిన ఒక యోడకెప్తాను, వీరిని అజోర్సు దీవులయందు దిగకుండ నాపివేసి, మరి యెక్కడికైనను

పోవచ్చునని చెప్పినప్పటికి విననందున వీరిని వీరి నావలతో ఒక ఫ్రెంచి రేవుకు తీసికొనిపోయి దిగవిడిచి, తాను అజోరు దీవులకు మరలిపోయెను. ఈ విషయమై పార్లమెంటులో చర్చ జరిగి, యింగ్లీషు కెప్తానుచర్య న్యాయమైనదని తీర్మానించ బడినది. దీనివలన తేలిన పర్యవసాన మేమనగా యుద్ధతులు తటస్థరాజ్యములనుండి దండయాత్రను బయలు దేరతీసినపుడు, వారి సైనికులు నిరాయుధులుగానే బయలుదేరినను, ఒక సేనాధిపతియొక్క ఆజ్ఞలకు లోబడి నడచుకొనుటకు ప్రయత్నించినయెడల, అట్టి దండయాత్రను తటస్థరాజ్యములవారు ఆపివేయవలసియుండును. పైనచెప్పినదండయాత్ర యింగ్లాండు నుండి బయలుదేరకుండగనే మొదట చేయవలసియుండెను గాని, యుద్ధతుల రాజ్యమైన అజోర్సుదీవులలోనికి పోగానే వారి నావలనుగాని, వారినిగాని యింగ్లీషు కెప్తాను పట్టు కొనుట న్యాయశాస్త్రమునకు విరుద్ధము. నడిసముద్రము లోనికి పోయినతరువాతనైనను కూడ పట్టుకొనగూడదు.

1870 వ సంవత్సరములో ఫ్రెంచివారికిని జర్మనులకును యుద్ధము జరుగుచున్నపుడు అమెరికారాష్ట్రములోనున్న ఫ్రెంచివారు తమ దేశముపక్షమున యుద్ధము చేయుటకు పోవుచుండిరి. కొద్దికొద్దిగా యిటుల అమెరికా దేశపు రేవుల నుండి పోవుచున్నను, అదియంతగా పాటించబడుచుండుట లేదు. కాని 1200 మంది ఫ్రెంచివారు ఒక్కమారుగా ఒక ఫ్రెంచినావలో తమకు కావలసిన మందుగుండుసామాను వేసి

కొని బయలుదేరిరి. అమెరికా ప్రభుత్వమువారికి జర్మనీవారు యీవిషయమై తెలియఁజేయగా బయలుదేరినవారు నిరాయుధులనియు, వారిని యుద్ధములో నడపుటకు సేనాధిపతులను తీసికొనిపోవుచుండలేదనియు, కాబట్టి యది యుద్ధార్థమైన దండయాత్రి కాదనియు, వారి దేశమునకు పోయినతరువాత సైన్యములో చేరుదురని నమ్మకము కలిగియున్నను అమెరికాదేశమునుండి తగిన యంగక్రమములు లేకుండ రణశిక్షను పొందకుండ పోవుచున్న సాధారణ ప్రయాణికుల కడ్డు కలిగించవలసిన పని లేదనియు, అమెరికావారు జవాబిచ్చిరి. త్రోవలో వీరికి జర్మనీవారి నావలు అడ్డు కలిగించి వీరి నందరిని ఖైదీలుగ పట్టుకొనుట న్యాయమేయైనను తమ దేశములోనుండి వీరు యీవిధముగ బయలుదేరినంతమాత్రముచేత తమ తటస్థతకు భంగము కలుగఁజేసినవారు కానేరరని అమెరికావారు తెలియఁజేసిరి.

పైన చెప్పిన మూ డుదాహరణములనుబట్టి యుద్ధతార్థమైన దండయాత్రియన నెట్టిదో తెలిసికొనవచ్చును. ఒక దండు తగిన సేనాధిపతిచేత నడుపబడవలెను. శీఘ్రముగ యుద్ధమున కుపయోగపడునట్లు యేర్పాటు చేయబడియుండవలెను. కాని తటస్థరాజ్యమును వదలగానే, బయలుదేరినవారు యుద్ధమునకు సిద్ధముగ నుండనక్కరలేదు. ఆయుధములను తీసికొనిపోనక్కరలేదు; యుద్ధతులు తటస్థరాజ్యములలో, కొంతసేనను యుద్ధసన్నద్ధులుగఁ జేసి తీసికొనిపోవుటకు ప్రయత్నించు

చున్నయెడల, తటస్థరాజ్యమునగౌరవపరచుటయేగాక, తన శతృవుతో దానికికూడ విరోధము కలిగించవచ్చును. కాబట్టి యిట్టి పనులకు, ఆ తటస్థరాజ్యము తగిన పరిహార మును, క్షమాపణయు కోరుటయేగాక, తన దేశమునుండి పోవ నున్న యా దండయాత్రను బలవంతముగ నాపివేయవచ్చును.

(3) తటస్థరాజ్యములు, తమ తటస్థతకు భంగము రాకుండ చేసికొన్న నిబంధనలకు లోబడుట—యుద్ధతుల సైన్యములు, తటస్థరాజ్యములోనికి పోకూడదు. కాని, వారి యుద్ధనావలుకూడ రాకూడదని తటస్థరాజ్యములు నిబంధ నను చేసికొన్ననేతప్ప, వారి రేవులకు యథేచ్ఛగ రావచ్చును. ఓడలు ప్రయాణము చేయుట కనర్హము లైనపుడుగాని, తుపాను కొట్టినపుడుగాని తప్ప, తక్కిన సమయములలో యుద్ధతులనావలకు, తటస్థరాజ్యమువారు నిషేధించినయెడల, వీరి రేవులకు వచ్చుటకు హక్కులేదు.

ఇరుకక్షులవారియుద్ధనావలు, తటస్థరాష్ట్ర రేవులకు ఒక్కసారియే వచ్చినపుడుగాని, లేక ఒకరియుద్ధనావలును, రెండవవారి వర్తకపుటోడలును కలసి వచ్చినపుడుగాని, ఒకరి యోడలు బయలుదేరిన 24 ఘంటలలోగా రెండవవారివి బయలుదేరకూడదు. తటస్థరాజ్యసమీపమున యుద్ధము జరుగకుండగను, అక్కడకు వచ్చు విదేశయోడలకు నష్టము సంభవించకుండగను యీ నిబంధన యేర్పడినది. యుద్ధతుల యుద్ధనావలు, యింగ్లీషువారి రేవులలో దిగినపుడు, 24 గంట

లలో తిరిగి వెళ్ళిపోవలెను. అవి మరమ్మతులు చేసికొనవలసి వచ్చినపుడును, వానికి అవసరముగ కావలసిన పదార్థములను తీసికొనవలసినపుడును, యెక్కువకాల ముండుటకు అంగీకారమును పొందవలెను. తమ నావికుల తినుబండారవస్తువులను కొనవచ్చును. తమ దేశము చేరుటకు కావలసిన బొగ్గు మాత్రము తీసికొనిపోవచ్చును. ఆధునికయుద్ధములలో యుద్ధతుల యుద్ధపుటోడలు, తాము పట్టుకొన్న యోడలను తటస్థరాజ్యములకు తీసికొనిరాకూడదు. తుపాను వచ్చినపుడును, ప్రయాణమున కనర్హమైనపుడుమాత్రమే తీసికొని రావచ్చును.

యుద్ధతుల సైన్యము, వారి శత్రువులవలన తరుమబడినపుడు, తటస్థరాజ్యములగుండా పారిపోవుట గలదు. అప్పుడు ఆ తటస్థరాజ్యములవారు వారిని పోనీయకుండ యుద్ధము ఆఖరగువరకు ఆపివేయవలయును. వీరి భోజనమున కగు వ్యయములు, వీరి దేశప్రభువులే, తటస్థరాజ్యమువారి కీయవలయును.

(4) తటస్థతకు భంగము కలిగించినపుడు తటస్థరాజ్యమునకు తగిన పరిహారము నొసంగుట—తటస్థరాజ్యములో నున్న యోడలనుగాని, సరకులనుగాని అన్యాయముగ యుద్ధతులు పట్టుకొన్నపుడు, వానిని ఆ రాజ్యమువారికి తిరిగి యిచ్చివేసి, ఆయాసందర్భములనుబట్టి తగిన పరిహారమును కూడ యుద్ధతు లీయవలసియుండును. యుద్ధతులు తమ శత్రు

వుల యోడలను తటస్థరాజ్య సముద్రతీరములో పట్టుకొన్న పుడు, తటస్థరాజ్యములవారు వానిని తమ స్వాధీనమును చేయవలసినదని అడుగవచ్చును. తమకు స్వాధీన మయినతరువాత వాని యజమానులైన రెండవకక్షివారికి యిచ్చివేయుదురు. యుద్ధతులు అట్లు స్వాధీనపరచకపోయినయెడల వారి యోడలను తటస్థరాజ్యమువారుకూడ పట్టుకొనవచ్చును. లేక, తగిన పరిహారమును కోరవచ్చును. లేక దానితో యుద్ధమునకు డీకొనవచ్చును.

ఒకానొకపుడు యుద్ధతులు తమ స్వసంరక్షణకు మిక్కిలి అవసరమని తోచినపుడు తమ విరోధుల రాజ్యములోనుండు తటస్థరాష్ట్రపౌరుల ఆస్తిని తాముపయోగించుకొనుటగాని, లేక ధ్వంసము చేయుటగాని తటస్థపడుచుండును. ఇది న్యాయశాస్త్రమునకు వ్యతిరేకమైనను తగిన పరిహారమును తరువాత యిచ్చినయెడల, తటస్థరాజ్యమువారు తృప్తినొందెదరు. ఇట్లు యుద్ధతులు బలవంతముగ తమ శత్రువుల దేశములోనున్న తటస్థుల యాస్తిని ఉపయోగించుకొనుట Right of Angary లేక Prestation అని వాడెదరు. 1870 వ సంవత్సరములో ఫ్రెంచివారి యుద్ధనావలు, సీనునదిమీదుగ రాకుండజేయుటకు జర్మనీవారు తటస్థులుగనున్న యింగ్లీషువారి ఆరు వర్తకపునావలను ఆ నదికి అడ్డముగా ముంచివేసిరి. యుద్ధ మయినతరువాత ఆంగ్లేయులు తగిన పరిహారమును జర్మనీవారివలన తీసికొనిరి.

అత్యవసరసమయములో యీ పని జరిగినదిగనుక, వీరికి వైరము పొసగలేదు.

---

## అధ్యాయము II

---

### యుద్ధతుల యెడల తటస్థుల విధులు

### (Duties of Neutrals towards Belligerents)

(1) యుద్ధతులలో యెవరికిగాని సహాయము చేయకుండుట. వీరిలో ఒకరికి కలుగజేయని సదుపాయము రెండవవారికి కూడనీయకుండుట—యుద్ధమునకు పూర్వము, తటస్థరాజ్యమును, యుద్ధతులలో నెవరును, ఒండొరులకు సహాయము చేసికొనవలయునని సంధి యేర్పడియున్నను, అట్లు చేయుటకు వలనుపడదు. యుద్ధతులలో చేరనపుడు, తటస్థరాజ్యమువారు, యిరుకక్షులవారి యెడలను నిష్పక్షపాతముగ నడచుకొనవలయును. యుద్ధతులకు ద్రవ్యముగాని, యుద్ధసామగ్రిగాని ప్రతిఫలము పుచ్చుకొనియైనను పంపకూడదు. 1798 వ సంవత్సరములో, యింగ్లాండునకును ఫ్రాన్సునకును యుద్ధము సంభవించినపుడు, అమెరికా దేశములో ఫ్రెంచివారు అప్పుతీయుటకు ప్రయత్నించగా, అమెరికా ప్రభుత్వమువారు తాము అప్పు యీయకపోవుటయే గాక, తమ దేశ పౌరు లిచ్చు అప్పులకు తాము జబాబుదార్లము కామని కఠిన

ముగ ప్రచురించిరి. తటస్థరాజ్యపౌరులు యుద్ధతులకు ద్రవ్య సహాయము చేయవచ్చును. సాధారణముగా తటస్థరాజ్యములు యుద్ధతులకు సహాయము చేయవద్దని తమ పౌరులకు తెలియగలందులకు ప్రకటనలు చేయుచుందురు.

(2) యుద్ధతులు తటస్థరాజ్యముగుండ తమ సేనను పంపకుండుట ; ఆరాజ్యములో సైన్యమును సమకూర్చుకుండుట.

తటస్థరాజ్య మంగీకరించని యెడల, యిరుకక్షులవారి సైన్యములకును, తన దేశములో నుండి త్రోవ యీయవచ్చునని కొందరు శాస్త్రజ్ఞుల యభిప్రాయము; కాని ఆధునిక శాస్త్రజ్ఞులందరు యిది కూడనిపని యని ఒప్పుకొనిరి.

1872 వ సంవత్సరములో జరిగిన బ్రస్సెల్సు కాన్ఫరెన్సులో, పరాజితులైన యుద్ధతుల సైనికులు పారిపోయి తటస్థరాజ్యములో చేరినపుడు, వారిని తిరిగి పోనీయకూడదనియు, యుద్ధాంతము వరకు అచ్చటనే, నిరాయుధులైయుండవలె ననియు యేర్పాటు చేయబడినది. జయమును పొందిన యుద్ధతులు శత్రునావలను, నావికులను, తటస్థరాజ్య రేవులకు తీసికొని వచ్చుచుందురు. అప్పుడు, తటస్థరాజ్యము వారు, ఆ నావలలోకి పోయి అక్కడి ఖైదీలను విడిపించ కూడదు. ఆ ఖైదీలు, తమంతట తాము తప్పించుకొని తటస్థరాజ్యములోనికి వచ్చినయెడల వారిని మొదట పట్టుకొన్న శత్రువులకు తిరిగి ఒప్ప చెప్పకూడదు.

(3) తటస్థులు, తమ రాజ్యములోనుండి యుద్ధతుల సహాయమునకు దండయాత్రను బయలుదేర నీయకుండుట. యుద్ధతులు తటస్థరాజ్యమును యేవిధముగ తమ యుద్ధమున కుపయోగించ కూడదో, ఆవిధముగనే తటస్థరాజ్యము కూడ తన దేశమును యుద్ధతుల కుపకరించునటుల చేయకూడదు. తటస్థరాజ్యమును యుద్ధతు లుపయోగించు కొనుట యెంత తప్పో, ఆరాజ్యములో తమ బలమును వృద్ధిచేసికొనుట కూడ అంత తప్పు. తటస్థరాజ్యముల నుండి సైన్యముగాని, యుద్ధనావలుగాని బయలుదేర కుండగను, ఆయుధ సామగ్రిగాని, యుద్ధము చేయగల నావికులను గాని నూతనముగ తీసికొని పోకుండగను తటస్థరాజ్య ప్రభువులు, సాధ్యమైనంతవరకు జాగ్రత తీసికొను చుండవలయును.

(4) తటస్థరాజ్యపౌరులను యుద్ధతుల కొలువునకు పోకుండ జేయుట—ఒక తటస్థరాజ్యమునకు లోబడిన వారు తమ దేశమును విడచి శత్రుసైన్యములో చేరకూడదు. కాని వారి ప్రభుత్వమువారు, యెల్లపుడు యుద్ధతుల సైన్యములోనికి చేరకుండ ప్రతిమనుష్యుని కనిపెట్టి యుండుట సాధ్యముకాదు. బహుమంది జనులు దేశమునుండి ఒక్కసారిగా యుద్ధతుల సేనలకు సహాయము చేయుటకు పోవుచున్నపుడు, ఆదేశ ప్రభువులు వారిని ఆపివేయవలసి యుండును. 1876 వ సంవత్సరములో రష్యాప్రజలు టర్కీతో యుద్ధము చేయుచున్న సర్వియనూవారికి సహాయము చేయుటకు వేలకొలది గొప్ప

ప్రవాహమువలె పోవుచున్నపుడు రష్యా చక్రవర్తి మిన్నకుండుట న్యాయశాస్త్రనమునకు విరుద్ధమైన పని.

(5) తటస్థరాజ్యములు, తమ తటస్థతను కాపాడుకొనక పోవుటవలన యుద్ధతులకు జరిగిన హానికి తగిన పరిహారము నొసంగుట. ఈ సూత్రమును, అన్నిరాజ్యములు ఒప్పుకొన్నను, దీనిని ఆచరణలో పెట్టునపుడు, చిక్కులు సంభవించుచుండును. ఎంత పరిహారము, యెట్టి పరిహారము యీయవలసి యుండునో నిశ్చయించుట కూడ దుర్లభము. ఈ విషయములు, ఉభయరాష్ట్రములవారును బేరముచేసి పైసలు చేసికొనవలెను. తటస్థరాజ్యములో ఒక ఆస్తిని యుద్ధతులు పట్టుకొన్నపుడు, ఆయాస్తి తటస్థులదైనను, శత్రువులదైనను, దానిని ఆ తటస్థరాజ్యమునకు తిరిగి యిచ్చివేయ వలయును. అట్లు యిచ్చివేయుట, యేకారణము వలననైనను అసాధ్యమైనపుడు దాని కిమ్మతు నీయవలెను. ఒకప్పుడు, యీయవలసిన మొత్తమును తేల్చుటకును, యీయవచ్చునా లేదా యను విషయమును నిర్ధారణ చేయుటకును, మధ్యవర్తులను కోరుకొను చుందురు. స్వల్పవిషయములకు తగువులు సాధారణముగా తటస్థించవు. ఆధునిక సంఘముల సమిశ్రిత నిర్మాణమును బట్టి తటస్థరాజ్యకార్యనిర్వాహకశాఖ, యెంత జాగ్రతగ కనిపెట్టి యున్నను, ఆదేశపౌరులు, విడివిడిగా పోయి యుద్ధతులలో చేరకుండ చేయుట మిక్కిలి కష్టము.

16

తటస్థరాజ్య రేవులలో యుద్ధతులలో నొకరి యోడ తన శత్రువుల ఓడను కొట్టినపుడు, తత్క్షణము తటస్థరాజ్యము వారికి తెలియజేయవలెను. అప్పుడు వారు, మొదటి యుద్ధపు టోడను మందలించి దాని యజమానుల వలన తగిన పరిహారమును తీసికొని రెండవదాని కిప్పించవలెను. అట్లు చేయని యెడల రెండవయోడ, స్వసంరక్షణకు, ఆ తటస్థరేవులలో యుద్ధము చేసినయెడల తటస్థరాజ్యము వారు ఊరుకొనవలసి నదే గాని తమ తటస్థతకు భంగము కలిగినదని యుద్ధతులలో నెవరివలనను, యెట్టి పరిహారమును పొందుటకు వలనుపడదు.

తటస్థరాజ్య రేవులలో యుద్ధతులు కట్టుకొన్న నావలు, ఆయుధములవంటివే గనుక, వానిని ఆ రేవులలోనుండి బయలు దేరనిచ్చుట తప్పుకాదు. యుద్ధములో యెగుమతి చేయకుండ నిషేధించబడిన వస్తువులవంటివే గనుక, దానిని నడి సముద్రములో శత్రువులు పట్టుకొనవచ్చును. దానిని పోనిచ్చుట దండయాత్రవంటిదే యైనయెడల, తటస్థరాజ్యము దాని నాపివేయవలసి యుండును. తటస్థరాజ్యములో నుండి బయలుదేరినపుడే, యుద్ధతుల క్రొత్తనావలో, యుద్ధమునకు పనికివచ్చు పరికరము లుండిననే తప్ప, దానిని నిషేధవస్తువుగ నెంచి, అది బయలుదేరు నపుడు ఆటంకము కలుగఁ జేయ కూడదు. కాని, యుద్ధతులు, క్రొత్తనావలను తటస్థ రాజ్య రేవులలో కట్టించి వానిని బయలుదేరఁ దీసికొని మరి యొక వర్తకపుటోడలో యుద్ధసామగ్రి యెగుమతి చేయించు

కొని, నడిసముద్రముచేరిన తరువాత, యీ యుద్ధసామగ్రిని తమ క్రొత్తనావలో వేసికొని శత్రువులపై బడుటకు వీలు కలుగవచ్చును. ఈ విషయము అమెరికావారును బ్రిటిషు వారును యేకీభవించక పోవుటవలన తృప్తికరముగ నేటికిని పరిష్కరింప బడలేదు. యుద్ధతులు నూతనముగ యుద్ధనావ లను తటస్థరాజ్యములలో కట్టగూడ దనియు, కట్టిన నావలు యుద్ధ మధ్యమందు పోగూడదనియు, నిబంధనల నేర్పరుచు కొనుట మిక్కిలి అవసరమని తోచుచున్నది. వర్తకపుటోడ లనే గాని, యుద్ధపుటోడలను కట్టగూడదని నిబంధన లుండ వలెను. ఈ రెండువిధములైన యోడలకు గల భేదమును, కట్టుచుండగనే, సులభముగ గ్రహించవచ్చును గాని, యే యుద్దేశముతో యుద్ధనావలను కట్టుచున్నారో తెలిసికొనుట మిక్కిలి కష్టము. ఒక రాజ్యముయొక్క తటస్థతకు భంగము కలిగించిన యుద్ధతుల యుద్ధనావలను తరిమి నడిసముద్ర ములో కూడ తటస్థరాజ్యమువారు పట్టుకొన వచ్చుననియు, అది తన స్వదేశములోనికి గాని, యితరరాష్ట్రముల రేవు లకు గాని చేరిన పిమ్మట దానిని పట్టుకొన గూడదనియు 1894 వ సంవత్సరములో ప్యారిసునగరమందు యేర్పడిన నిబం ధనలలో చెప్పబడి యున్నది. యుద్ధతులు తమ శత్రువుల నుండి పట్టుకొన్న ఓడలను తటస్థరాజ్య రేవులకు తీసికొని రాగూడదని, యిప్పు డన్నిరాజ్యముల వారును ఒప్పుకొన్న విషయమే.

---

# అ ధ్యా య ము III

---

( Neutral trade )

తటస్థపౌరుల సామాన్యవర్తకము

శత్రువుల రాజ్యములో తటస్థుల ఆస్తి యున్నయెడల దానిని శత్రువులఆస్తివలెనే యుద్ధతు లుపయోగించవచ్చును. నడిసముద్రముమీాద పట్టుబడిన తటస్థుల ఆస్తివిషయమై 1856 వ సంవత్సరములో ప్యారిసునగరమందు యీా క్రింది సూత్రము లేర్పాటు చేసికొనబడినవి——

(1) తటస్థుల నావలను యుద్ధతులు ఉపయోగించు నిమిత్తము యీాయబడగూడదు. అవి యుద్ధములో చేర కూడదు.

(2) తటస్థుల నావలలో తీసికొనిపోబడుచున్న శత్రువుల సరకులను యుద్ధతులు పట్టుకొనగూడదు. యుద్ధములో, యుద్ధతరాజ్యములకు యెగుమతి చేయబడకూడదని నిషేధింపబడిన సరకులైనయెడల, వానిని యుద్ధతులు పట్టుకొనవచ్చును.

(3) అట్టి నిషేధింపబడిన వస్తువులుగాక, తక్కిన తటస్థుల సరకులు, శత్రునావలమీాద తీసికొని పోబడుచున్నను, వానిని యుద్ధతులు పట్టుకొనగూడదు.

(4) సముద్రతీర ముట్టడులు, అమోఘమైనవి కాని యెడల తటస్థులను బాధించవు; అనగా, తటస్థరాజ్యనావలు రాకుండ శత్రుదేశము చుట్టును, తగినంత సేన నేర్పరచవల యును.

పైనచెప్పిన రెండుమూడు సూత్రములనుబట్టి నావ యొక్క పతాకము నావలోనుండు సరకులను, యుద్ధతుల నైనను రక్షించును. అది శత్రుపతాకమైనను, ఆ నావలో నుండు తటస్థసరకుల కెంతమాత్రము హాని కలుగనేరదు. ఈ సూత్రములకు ఒక్కనిషేధముమాత్రమే యున్నది. యుద్ధ తులవలన తమ శత్రురాజ్యములకు యెగుమతి చేయకూడ దని నిషేధింపబడిన వస్తువులను యుద్ధతులు పట్టుకొని తీరు దురు. అట్టి సరకులు తీసికొనిపోబడుచున్నవో లేదో తెలిసి కొనుటకు యుద్ధతుల నావలు వానిని పట్టుకొని సోదా చేయ వచ్చును. తటస్థరాజ్య యుద్ధనావను వెంటబెట్టుకొని దాని వర్తకపుటోడలు బయలుదేరిపోవుచున్నను, వానిని యుద్ధ తులు సోదా చేయకుండ ఆ యుద్ధనావయొక్క కెప్తాను తాను ఆపుటకు వలనుపడదని ఆంగ్లేయన్యాయాధిపతులు తీర్పులు యిచ్చియున్నారు. తటస్థుల ఓడలు శత్రువుల యుద్ధ నావల సంరక్షణక్రింద సబుర్లు చేయకూడదు. అట్లు చేసిన యెడల వానిని గూడ పట్టుకొనవచ్చును. ఈవిధముగనే శత్రు వుల వర్తకపుటోడలను తటస్థ యుద్ధనావలు తమ సంరక్షణ క్రింద నుంచుకొని సబుర్లు చేయించకూడదు.

---

# అ ధ్యా య ము IV

---

## (Blockade)

### సముద్రతీర ముట్టడులు

సముద్రతీరము గల శత్రురాజ్యములకు తటస్థనావలను పోకుండఁ జేసి, ఆ రాజ్యములను లొంగునట్లు చేయుటకు యుద్ధతులు తమ నావల నక్కడ కాపలా వేయుదురు. శత్రు రాజ్యములకు కావలసిన సరకులు రానియెడల అక్కడి ప్రజలు క్రమక్రమముగ క్షీణదశకు వచ్చి శీఘ్రముగ లోబడవచ్చును. కాని ఆ శత్రురాజ్యమునకు అంటి మరికొన్ని తటస్థరాజ్యము లున్నయెడల యీ సముద్రతీర ముట్టడి వారి నేమియు బాధించఁ జాలదు. ఇంగ్లాండువంటి రాజ్యమును సముద్రము మీఁద ముట్టడించిన యెడల, దానికి కావలసిన ఆహారపదార్థ ములు చాల భాగము బయటనుండి రావలయును గాన, దానికి మిక్కిలి నష్టము కలుగుననుటకు సందేహము లేదు. ఈ కారణమును బట్టియే ఆంగ్లేయులు, ప్రపంచములో నితర సముద్రతీర రాజ్యములకంటె యెక్కువ యుద్ధనావల నేర్పాటు చేసికొనిరి. వీరి తరువాత, జర్మనీవారు యుద్ధనావల నెక్కు వుగ కలవారు గాన 1914 సంవత్సరములో ఆంగ్లేయులకును, జర్మనులకును జరిగిన నావికాయుద్ధము మిగుల తీక్షణముగ నుండి యుండునుగాని యింతలో జర్మనీవారు రాజీ చేసికొన

వలసి వచ్చినది. తమ నావికాదళమును బాల్టిక్కు సముద్రములోనే విచ్ఛిన్నము చేయబడినది.

ముట్టడి వేసితిమని యుద్ధతులు కాకితములమీద ప్రకటించినంతమాత్రమున, అది ముట్టడి యనిపించుకొనదు. నిజముగా తమ నావలను శత్రువుల సముద్రతీరములయందు నిలుపవలెను. ముట్టడికి తగినన్ని శత్రునావలు కాపలా లేని యెడల, తటస్థులు ఈ ముట్టడులను సరకుగొనరు. వీరి నావలను అట్టి స్థితిలో పట్టుకొన్న యెడల, తటస్థులు క్రమమైన పరిహారమును కోరక మానరు. కాని కాపలాగా నున్న ఓడలు తుపానువలనగాని, శత్రువులను తరుముచుండుటవలన గాని దూరముగ పోయినంతమాత్రముచేతను, లేక తటస్థ నావలకు గాలి అనుకూలముగ నున్నంతమాత్రముచేతను, శత్రువుల సముద్రతీరములను ముట్టడివేయలేదని యెంచకూడదు. ముట్టడించిన నావలను తప్పించుకొనిన శత్రురాజ్యములోనికి పోవుటయు, బయటకు వెళ్లుటయు తటస్థులు జరిగించవచ్చునుగాని, ముట్టడించిన యుద్ధతులు వానిని యీ లోపుగ పట్టుకొని జప్తు చేసినయెడల, తటస్థరాజ్యము లెంతమాత్రమును జోక్యము కలుగఁజేసికొనగూడదు. లోపలికి వెళ్లునపుడును, బయటకు వచ్చునపుడును, తప్పక అపాయము కలుగునని తెలియునట్లు యుద్ధతులు శత్రుసముద్రతీరమును ముట్టడించవలయును. ముట్టడించిన నావలు, శత్రుసముద్రతీరమునకు దూరముగకూడ నుండవచ్చును. క్రిమియాయుద్ధ

ములో రైగా అను రష్యావారి పట్టణమును, 120 మైళ్ళ దూరముననున్న ఒక్క ఆంగ్లేయఓడ ముట్టడించెను. ఆ రైగా పట్టణమునకు దారి ఒక సన్నని కాలువగుండ నున్నదిగనుక, బయటనుండి యేయోడయు రాకుండ యీ ఒక్కయోడయే ఆటంకపరచగలిగెను.

ఒక దేశములో అంతఃకలహము సంభవించినపుడు, ప్రభుత్వమువారు పితూరి చేసినవారి స్వాధీనములోనున్న రేవులకు విదేశీయనావలు రాకూడదని నూతనముగ నిబంధన చేయకూడదు. తమ శక్తి గలిగినయెడల, తమ నావలతో ఆభాగమును ముట్టడి వేయవలెను. తమ స్వాధీనములో నున్న రేవులవిషయమై అట్టి నిబంధనలను చేసికొనవచ్చును.

యుద్ధము ముగిసినపుడుగాని, ముట్టడి వదలివేసినపుడుగాని ముట్టడించినవారు పరాజితులైనపుడుగాని యీసముద్రతీర ముట్టడి అంతమగును. ముట్టడి మొదలుపెట్టినట్లు ముట్టడించిన యుద్ధతులు, తటస్థరాజ్యములవారికి ముందుగా తెలియజేయవలెను. లోపలికి రాబోవు నావలను రాకుండ ఆపివేయుటయే, శత్రు రేవులను ముట్టడించినటుల, తటస్థనావలు నోటీసుగా నెంచుకొనవలయును. తటస్థరాజ్య ప్రభుత్వమునకు ప్రకటించినయెడల, దాని పౌరులకు తెలిసినట్లు యెంచబడును. ముట్టడినిగురించి యేవిధముగనైనను తెలిసికొని తటస్థయోడ యుద్ధతుల రేవుకు పోయినయెడల, దానిని

తప్పక పట్టుకొనవచ్చును. ముట్టడిని బహిరంగముగ ప్రచురించనియెడల, తటస్థయోడ యజమాని తన కాసంగతి దూరదేశమునుండి వచ్చుచుండుటవలన తెలియలేదని రుజువు చేయవచ్చును. అట్లు ప్రచురపరచినపుడు తాను ఆ ముట్టడింపబడిన రేవునకు పోవలెనని బయలుదేరుటయే నేరముగ నెంచబడును. ఆ యోడ యజమానికి మొదటినుండియు దురుద్దేశమున్నటు లెంచి ముట్టడించినవారు దానిని జప్తు చేయవచ్చును. ముట్టడిని ప్రచురించినపుడు, అది తీసివేయబడినదని తిరిగి ప్రచురించువరకు, అమలులో నున్నదనియే యెంచవలెను. ముట్టడించినవారు పరాజితులై పలాయనమైనపుడు, తిరిగి తాము ముట్టడించితిమని ప్రచురపరచువరకు ముట్టడి లేనట్లుగనే యెంచి తటస్థయోడలు యుద్ధతుల రేవులకు పోవచ్చును.

ముట్టడి మొదలుపెట్టినతరువాత ఆ సంగతి తెలిసికొనియు, ముట్టడించువారిని మోసపుచ్చి యేమరుపాటున గాని, బలాత్కారముగగాని యుద్ధతుల రేవులోలికి చొరవడుటకు ప్రయత్నించినను, లేక ఆ రేవులలోనుండి సరకులను తీసికొని బయటకు రా బ్రయత్నించినను, తటస్థనావలు పట్టుకొనబడవచ్చును. ముట్టడికి పూర్వమందు, శత్రువుల రేవులలో నున్న తటస్థయోడలు బయటకు పోవుటకు ముట్టడించువారు కొంత వ్యవధి నొసంగుదురు. ముట్టడికి పూర్వము యెగుమతియైనసరకులతో తటస్థఓడలు బయటకు పోవచ్చును.

ముట్టడి వేసినతరువాత సరకును యెంతమాత్రము యెక్కించు కొనగూడదు. ముట్టడికి పూర్వమందు శత్రు రేవులకు కొంత సరకును తీసికొనిపోయి, ముట్టడి మొదలుపెట్టినతరువాత, ఆ సరకునే తిరిగి వేసికొని తటస్థయోడ బయలుదేరగా, దానిని పట్టుకొనగూడదని ఒక యింగ్లీషు శాస్త్రవేత్త తీర్పు యిచ్చెను.

బయలుదేరినపుడు ముట్టడిసంగతి తెలిసినను, తరువాత ప్రయాణమధ్యమందు ముట్టడి వదలిపోయినదని తెలియగనే తటస్థయోడను పట్టుకొనగూడదు. ఈ విధముగనే ముట్టడి వదలిపోయినట్లు నమ్మదగిన సమాచారము త్రోవలో తెలిసి తటస్థయోడ యుద్ధతుల రేవునకు పోవుచుండగా ఆ సమాచారము సరియైనది కాకపోయినంతమాత్రముచేత, దానిని పట్టుకొనగూడదు. తటస్థుల యుద్ధనావలు ముట్టడి యున్నను యుద్ధతుల రేవులకు పోవచ్చును.

ముట్టడిని తప్పించుకొనుటకు ప్రయత్నించిన తటస్థ నావ దానిలోనున్న సరకులతోకూడ పట్టుబడి జప్తు చేయబడును. సాధారణముగా, ఓడమాత్రమే జప్తు చేసెదరు. దానిలోని సరకులు, ఓడ యజమానివి కానియెడల, ముట్టడి సంగతి సరకుల యజమానికి తెలియలేదని రుజువుపరచినపుడు, సరకులు వదలివేయబడును. ఓడకెప్తాను దారితప్పించి యుద్ధతులచేత ముట్టడింపబడిన రేవులకు పోవుచున్నయెడల, ఆ ఓడను పట్టుకొనెదరుగాని యీ సంగతి తెలియని సరకుల

యజమానికి నష్టము కలుగఁజేయరు. ముట్టడిని అలక్ష్యము చేసి శత్రువుల రేవులలోనికి పోయిన తటస్థఓడను, అది తిరిగి తన దేశమునకు వచ్చి చేరేలోగా, యుద్ధతులు పట్టుకొన వచ్చును. కాని యీలోపుగా, యేకారణమువలననైనను ముట్టడి బొత్తిగ వదలిపోయినయెడల, ఆ యోడను పట్టుకొన గూడదు.

ఒకప్పుడు తటస్థుల యోడ మరియొక తటస్థరాజ్య రేవులకు సరకు తీసికొనిపోయి, అక్కడనుండి మరియొక యోడలో, ఆ సరకును వేసి ముట్టడింపబడి యుద్ధతుల రేవులకు పంపుట కలదు. ఆ యోడ యజమాని యుద్దేశము యెట్టిదైనను, అతను చేసిన పని శాస్త్రసమ్మతమేగనుక, ఆ యోడను పట్టుకొనగూడదు. సరకుల యజమాని యుద్దేశము ముట్టడింపబడిన రేవునకే తీసికొనిపోవలెనని కనుపడినయెడల, ఆ సరకులను కూడ జప్తు చేసి తీసికొనిపోవచ్చును.

---

## అధ్యాయము V

---

### ( Contraband )

### నిషేధ వస్తువర్తకము

యుద్ధతులు తాము యుద్ధము చేయఁగలిగిన స్థలములలో నెల్ల తమ శత్రువులకు యుద్ధములో ఉపయోగించు

సామగ్రిని, వారికి చేరకుండ పట్టుకొనవచ్చును. కాని తటస్థ రాజ్యముల వర్తకులు యుద్ధసమయములోకూడ ఆయుధములు, ఫిరంగులు, మందుగుండుసామానులు మొదలగు యుద్ధపరికరములలో వర్తకము చేసికొనవచ్చును. కాని వారి వారి స్వంతజవాబుదారిమీద యిట్టి వర్తకము చేసికొనవలసినదేగాని, వారి ప్రభుత్వమువారు యేవిధముగను వారికి సహాయము చేయరు. ఈ వర్తకము జూదమువంటిది. పట్టుబడినయెడల, వారి యజమానులే నష్టపడుదురు. తమ దేశములోనుండి దండయాత్ర బయలుదేరకుండగను, తమ రేవులలోనున్న శత్రునావలకు యుద్ధసామగ్రి రాకుండగను, తగిన యేర్పాటులు తటస్థరాజ్యప్రభువులు చేసిన చాలును. యుద్ధతులకు శక్తి యున్నయెడల, తటస్థరాజ్యముల వర్తకపుటోడల మీద యిట్టి నిషేధవస్తువులు పోవుచున్న యెడల పట్టుకొనవచ్చునుగాని, తటస్థరాజ్యప్రభువులమీద దోషారోపణ చేయకూడదు. తటస్థుల సరకులు నడిసముద్రముమీద తటస్థుల ఓడలలో పోవుచున్నను, అవి శత్రువుల రాజ్యములలో దిగుమతి యగుటకు పంపబడుచున్నవని రుజువు కాగానే, యుద్ధతులు వానిని పట్టుకొనవచ్చునుగనుక, అట్లు శత్రువులకు పంపగూడని పదార్థములు యేవియో యేర్పడవలెను. యుద్ధసామగ్రి, అనగా కత్తులు, తుపాకులు, ఫిరంగులు, మందుగుండుసామానులు, యుద్ధనావలు, ఆకాశ విమానములు మొదలగునవి నిషేధవస్తువులని యెంచబడినవి. ఇవి తక్కిన

పదార్థములను గావించి అనేక భిన్నాభిప్రాయము లున్నవి. ఆంగ్లేయులు, యుద్ధములో వాడబడు అన్నివిధముల ఆయుధ ములు, వానిని చేయు యంత్రములు, యివి చేయుటకు కావలసిన పదార్థములు, తుపాకిమూది, సోల్జరుల దుస్తులు, మొదలగునవి నిషేధవస్తువులని యెంచుచున్నారు. కొన్ని వస్తువులు శత్రుదేశములో యెవరి యుపయోగమునకు పంప బడినవో అప్పటి సంగతిసందర్భములు తెలిసినమీదట, నిషే ధింపబడవలసినవా కావా యను విషయము నిర్ధారణ చేయ వచ్చును. వీనిలో భోజనపదార్థములు, ధనము, బొగ్గు, గుఱ్ఱ ములు, రైల్వేలకును టిలిగ్రాఫుల తీగెలకును కావలసిన పదార్థములు, ఓడకొయ్యలు, తెరచాపలు, బాయలర్లు చేర వచ్చును. ఇవి తప్పకుండ యుద్ధములో ఉపయోగించుటకై దిగుమతి చేయబడునని తెలియగనే, నిషేధవస్తువులు పరిగ ణింపబడును. యూరపుఖండములో తక్కినవారు ఆంగ్లేయు లతో యీ వస్తువులనుగురించి యేకీభవించరు.

తటస్థవర్తకపుటోడలు, తమమీద ఓడదొంగలు శత్రువులు పడకుండ స్వసంరక్షణకు కావలసిన ఆయుధము లను తీసికొనిపోవచ్చును. ఈ ఒక్కవిషయములోతప్ప, శత్రు దేశములకు తీసికొనిపోవలెనను ఉద్దేశము స్పష్టముగ కనుపడి నపుడు యుద్ధతులు వానిని తప్పకుండ పట్టుకొనెదరు. తటస్థ రాజ్యమునకు ఆ సరుకు తీసికొనిపోబడుచున్నను, ఆ రాజ్య రేవులలోనున్న శత్రునావలలోనివారి యుపయోగార్థము అవి

నిజముగా తీసికొనబడుచున్నవని నిశ్చయమైనపుడు, ఆ సరకు లను పట్టుకొనవచ్చును. అందజేయు స్థలములను బట్టి నిషేధ వస్తువులు పట్టుబడుచుండును. నడిసముద్రముమీద శత్రునావ లకు చేర్చుటకై యెగుమతి చేయబడిన తటస్థుల నిషేధవస్తు వులను త్రోవలో యుద్ధతులు పట్టుకొనవచ్చును. తటస్థ ఓడ కెప్తాను దగాగా మార్గమధ్యమందున్న ఒక తటస్థరాజ్య ములో ఆ సరకులను దింపినంతమాత్రముచేత నిజముగా అక్కడనుండిన శత్రురాజ్యమునకు తీసికొనిపోబడుచున్నవని తెలియగనే, యుద్ధతులు ఆ నావను పట్టుకొని జప్తు చేసెదరు.

తటస్థులఓడ నిషేధవస్తువులను వేసికొని, యుద్ధతుల రేవునకు బయలుదేరగానే అది నేరము చేసినట్లు యెంచబడి పట్టుబడవచ్చును. అది యుద్ధతుల రేవునకు సురక్షితముగ నేరి నిషేధవస్తువులను అక్కడ దింపివేసి, తిరిగి వచ్చునపుడు దానిని ఆ యుద్ధతుల శత్రువులు పట్టుకొనగూడదు.

సాధారణముగా యుద్ధతులు శత్రురాష్ట్రమునకు యెగుమతి చేయబడిన నిషేధవస్తువులను మాత్రము పట్టు కొని, ఆ వస్తువులను తీసికొనిపోవుచున్న తటస్థనావను వదలి వేయుదురు. నావయు, ఆ సరుకును ఒకరివే యైనయెడల, రెంటిని పట్టుకొని జప్తు చేసెదరు. సరకుల యజమాని ఓడలో ఒక భాగస్థుడైనయెడల అతని భాగమునుకూడ జప్తు చేసెదరు. ఒక తటస్థనావ మరియొక తటస్థుని నిషేధ

వస్తువులను తీసికొనిపోవుచున్నపుడు తన యోడ సురక్షితముగ నుండునుగాని, ఆ వస్తువులు తనవే యైనయెడల, తన యోడనుకూడ పోగొట్టుకొనును. నిషేధవస్తువులను తీసికొని పోవుచున్న వాసి యజమానిఓడలోనుండు తన తక్కిన సరకులనుకూడ పోగొట్టుకొనును.

తటస్థనావ, తాను తీసికొనిపోవుచున్న నిషేధవస్తువులు, యుద్ధతుల చేతులలో పడకుండ తప్పించుకొనుటకై తప్పుడు కాకితములను సృష్టించి, తాను నిజముగా వెళ్లదలచుకొన్న యుద్ధతుల రేవును మరియొక తటస్థరేవుగ మార్చినను లేక, ఆ నిషేధవస్తువులను దాచినను, ఓడకూడ జప్తు చేయబడును. తటస్థుల యోడ యుద్ధతుల నావికాసైన్యమునకును, వారి యితర సైన్యమునకును, ఉత్తరప్రత్యుత్తరములను తెచ్చుచుండినయెడల శత్రువులు దీనిని పట్టుకొనెదరు. యుద్ధతులకును తటస్థరాజ్యములోనున్న వారి రాయబారికిని జరుగునట్టియు, లేక తటస్థరాజ్యమునకును, యుద్ధతుల రాజ్యములోనున్నదాని రాయబారికిని జరుగునట్టియు రాజకీయలేఖలను తటస్థనావలు తీసికొనిపోవచ్చును. మిలిటరీ నావికావిషయములనుగురించి రాజకీయలేఖలు తటస్థనావలు తీసికొనిపోగూడదు. యుద్ధతుల రాజ్యములనుండి తపాలును తీసికొనిపోవు ఓడలను సోదా చేయు నాచారము లేదు.

తటస్థఓడలలో యుద్ధతుల మిలిటరీ నావికాయుద్యోగస్థులు మామూలు బాటసారులవలెనే, తమ ఖర్చుమీద

ప్రయాణము చేయవచ్చును. వారిని శత్రువులు పట్టుకొన గూడదు. కాని, వారు తమ ప్రభుత్వమువారి ఖర్చుమీద పోవుచున్నపుడు, వారిని శత్రువులు పట్టుకొనవచ్చును. రాయబారులను పట్టుకొన కూడదు. తటస్థదేశపుటోడలు, యుద్ధతుల పోరాటములో యేవిధమైన జోక్యము కలుగజేసికొనకుండ యిట్టి నిబంధనలు యేర్పడినవి. ఈపనులు చేసిన ఓడను పట్టుకొని జప్తు చేసెదరు. తటస్థఓడలో యుద్ధతుల దేశముల నుండి ప్యాకెట్టులు పంపబడినపుడు, వారికి యుద్ధములో నుపకరించు సమాచారము లున్నటుల ఓడ కెప్తానుకు తెలిసినట్టు రుజువు లేనియెడల, ఆయోడను జప్తు చేయకూడదు. కాని అతను, యీ ప్యాకట్టును, తటస్థరేవులలో కంటె, యుద్ధతుల రేవులలో యెక్కువ జాగ్రతగ పరిశీలించుచుండ వలెను. ప్యాకెట్లపైన వ్రాసిన చిరునామాదారు, యుద్ధతుల యేజెంటు అయిన పక్షమున, ప్యాకెట్టులోని సంగతులను దానిని పంపిన వారివలన ముందుగా తెలిసికొనవలెను. అప్పుడు కూడ, యీయన మోసపోయిన యెడల ఓడ జప్తు కాకూడదు.

నిషేధ వస్తువులను తీసికొని పోవుట వర్తకసరళిలో న్యాయమే కాని యుద్ధతులు తమ యేజెంట్లకు పంపు రాజకీయ లేఖలును, వారి మిలిటరీ యుద్యోగస్థులను తీసికొని పోవుట, యుద్ధములో వారిపక్షమున చేరినట్లే యెంచబడును. నిషేధవస్తువులను తీసికొని పోయినపుడు ఆ వస్తువులు జప్తు కాబడును. గాని, ఓడను జప్తుచేయరు. శత్రువులకు లాభించు

కాకితములను ఒక తటస్థరేవునుండి మరియొక తటస్థరేవునకు, ఒక తటస్థయోడ తీసికొని పోవుచున్నను, ఆయోడ కెప్తాను తగు జాగ్రత తీసికోనియెడల ఆకాకితములను శత్రువున కందించులోగా, అతని యోడ పట్టుకొని జప్తు చేయ వచ్చును. యుద్ధతులకు యుద్ధవిషయములో మిక్కిలి అనుకూలమగు కాకితములను, వారి శివిలు మిలిటరీ యుద్యోగీయులను తీసికొని పోయినపుడు, ఓడనే ముఖ్యముగ జప్తు చేయుదురు. నిషేధవస్తువులు తీసికొనిపోబడు స్థలము ముఖ్యముగ గమనించవలసి యున్నది. సదరు కాకితములను ఉద్యోగస్థులను తీసికొని పోవు ఓడ యెక్కడనుండి యెక్కడకు పోవుచున్నను దానిని తప్పక పట్టుకొనెదరు.

---

## అంతర్జాతీయసమితి

యూరప్పుఖండములో 1918 వ సంవత్సరాంతము వరకు జరిగిన ఘోరసంగ్రామములో, కోటిమంది పడుచువాండ్రును, అనేక కోట్ల ధనమును నాశనమగుటచేత, యికముందు యిట్టి విపత్తులు సంభవించకుండ, నానారాష్ట్రములును ఒక సంఘముగ కూడి, తమ మధ్య అప్పుడప్పుడు బయలుదేరుచుండు తగవులను, న్యాయముగను, సౌమ్యముగను పరిష్కరించుకొనుటకు, కొన్ని ముఖ్యరాష్ట్రములు 1920 వ సంవత్సరములో ఒక అంతర్జాతీయసమితిగా నేర్పడినవి. ప్రస్తుతము యీ సమితిలో యేబదియైదు రాష్ట్రములు చేరినవి. తక్కినవి కూడ క్రమ క్రమముగా చేరనై యున్నవి.

దీనిలో ముఖ్యరాజ్యాంగములు మూడు కలవు:— (1) అసెంబ్లీ (2) కౌన్సిలు, (3) సెక్రటరీయట్ ఇవిగాక, అంతర్జాతీయ న్యాయస్థానము (The Permanent Court of International Justice), అంతర్జాతీయకార్మిక సంస్థాపనము (The International Labour Organisation) అను రెండు ముఖ్యశాఖ లున్నవి. ఈ యంతర్జాతీయసమితిలోని అసెంబ్లీకిని, కౌన్సిలునకును సమానాధికారము లున్నవి, గాని వీని తీర్మానముల నొకపుడు సమితి యావత్తు కూర్చి వారి యంగీకారమును పొందుచుండును. ఆచరణలో కార్యనిర్వాహక శాఖగా, కౌన్సిలువారు పని చేయుచున్నట్లు యెంచుకొన వచ్చును.

ఈ కౌన్సిలులో, నాలుగు రాష్ట్రముల ప్రతినిధులు యెల్లప్పుడు నుండి తీరవలయును. (1) బ్రిటీషుసామ్రాజ్యము, (2) ఫ్రాన్సు, (3) ఇటలీ (4) జపాను—అస్సెంబ్లి వారు రప్పుడప్పుడు యెన్నుకొను రాష్ట్రప్రతినిధులు కూడా, యీ కౌన్సిలులో చేరియుందురు. అంతర్జాతీయసమితిలో చేరిన అన్ని రాష్ట్రముల వారును కలసి, ముగ్గురు మెంబర్లను అస్సెంబ్లీకి యెన్నుకొనెదరు. సెక్రటరీయటులోని మెంబర్లు నిలకడగానే యెల్లప్పుడు నుందురు. జాతులను బట్టి గాక, విషయములను బట్టియే, యిది అనేకశాఖలుగా విడదీయబడి, అంతర్జాతీయ సమితికి జవాబుదారై యుండును. దీని శాఖలలో ముప్పది జాతుల ప్రతినిధు లిప్పు డున్నారు. అంతర్జాతీయకోర్టులోని జడ్జీలు సంపూర్ణస్వాతంత్ర్యములు కలవారై, కౌన్సిలు, అసెంబ్లీల వలన యెన్నుకొన బడుదురు. ఈ సమితి కావలసిన ఖర్చులు, దీనిలో చేరిన రాష్ట్రములవారు, తమ యాదాయము, ప్రాముఖ్యత మొదలగు వానిని బట్టి వసూలుచేయు ద్రవ్యములో నుంచి వ్యయపరచ బడుచుండును. ఇంతవరకు సంవత్సరము 1 టికి సుమారు ఒకకోటి యేబదిలక్షల రూపాయిలు, యీ యంతర్జాతీయసమితి యెస్టాబ్లిషుమెంటు క్రింద ఖర్చగుచున్నది.

ఈ యంతర్జాతీయసమితి, రాష్ట్రముల మధ్య తగవులు తటస్థించినపుడు, వాని కోరికలపైని, రాజీనామాలు చేయుటకు ప్రయత్నించును, లేదా అంతర్జాతీయ న్యాయస్థాన

తీర్పును పొందవచ్చును. ఆతీర్పులను లక్ష్యము చేయని రాష్ట్రి మును, యీసమితి బలవంతపెట్టి ఒప్పించలేదు. అయినను, సామాన్యముగా బయలుదేరిన అనేకచిన్నతగవులను పరిష్కరించినది. ఆలండుదీవులు కొన్ని షరతులతో ఫిన్లెండు కిప్పించుట, పోలెండు, లితుయానియా రాష్ట్రిములకును, జర్మనీ, పోలెండులకును, అల్బేనియా సెర్వియాలకును, గ్రీసు ఆల్బేనియాలకును, పోలెండు చెకొస్లొవియాలకును యెల్లలను నిర్ధారణ చేయుట, మెమెల్ పట్టణము కొన్ని షరతులతో లితుయానియా రాష్ట్రిమున కిప్పించుట ట్యూనిసు, మొరాకోలను గురించి యింగ్లాండు, ఫ్రాన్సుదేశముల మధ్యనుండు తగాయిదాలను పరిష్కరించుట—యీ మొదలగు రాజకీయ వ్యవహారము లనేకములు యీసమితి తీర్మానించినది. ఆ తీర్మానముల నంగీకరించి, ఆయారాష్ట్రములు, అపులు జరుపుకొను చున్నవి.

ఇదిగాక, ప్రపంచములో ఆయారాష్ట్రిములలో అప్పుడప్పుడు బయలుదేరుచున్న ఆర్థిక సమస్యలను, సాంఘిక సమస్యలను పరిష్కరించుటకు, యీ సమితి మిక్కిలి తోడ్పడుచున్నది. ప్రపంచములోని మేధావంతులు, దీని కమిటీలలో చేరి యుండుటచేత, వీరి విచారణలు, సలహాలు చాలా యుపయోగముగా నుండు ననుటకు సందేహములేదు. ఆస్ట్రియా, హంగెరీ రాష్ట్రిముల యార్థికస్థితిని బాగుచేయుట, యుద్ధానంతరము తిరిగి దేశములోనికి వచ్చిన పదిలతుల గ్రీకుపౌరు

లకు, యిళ్లు నిప్పించి, వారందరికి తిండి కల్పించుట మత్తు పదార్థములు, యీతిబాధలు, అంటురోగములు, మన్యజ్వర ములు మొదలగు వానిని పారద్రోలుటకు తగిన యుపాయ ముల నన్వేషించుట, యీ మొదలగు ప్రపంచమున కంతకు ప్రయోజనకరములగు పను లనేకములను చేయుటయే గాక, రాష్ట్రము లన్నిటికిని, క్లిష్టసమయములలో సరియైన సలహాల నొసంగుచున్నది.

రాష్ట్రములు ఒండొంటితో చేసికొను సంధులు, యీ సమితి కెప్పటి కప్పుడు తెలియచేసి, దీని ఆఫీసులో రిజస్టరు చేయుచుండవలెను. రహస్య సంధుల కెంతమాత్రము యెడ మీయ కూడదని, దీని ముఖ్యనిబంధనలలో ఒకటియై యున్నది. అంతర్జాతీయకోర్టులో 11 గురు జడ్జీలును, 4 గురు డిప్యూటీ జడ్జీలును సుమారు 15 జాతుల తరఫున, తొమ్మిది సంవత్సరముల కెన్నుకొన బడిరి. ఇది పంచాయతీ కోర్టు కాదు. దీనిలోని న్యాయాధిపతులు, చట్టములకు విరుద్ధముగ నడువకూడదు. మర్యాద రానున్న తీర్పుల కెట్టి సావకాశ మును లేదు. ఏరెండు రాజ్యములైనను, తమ కిష్టమైన యెడ లనే, తమమధ్య సంకురించిన తగవులను, యీ కోర్టువారిచేత పరిష్కరించు కొనవలెను. ఈమధ్య జరిగిన కొన్ని రాష్ట్ర ముల యొడంబడికలలో కొన్నికొన్ని విషయములు, విధిగా యీ కోర్టువారిచేతనే పరిష్కరింప బడునట్లు వ్రాయబడు చున్నవి. కాని పెద్దరాష్ట్రముల, సేనలను, నావికాదళములను

తగ్గించవలెనని యీసమితివారు చేయుచున్న ప్రయత్నములు యింకను కొనసాగలేదు.

స్వల్పతగవులలో యీ యంతర్జాతీయసమితి యెంత యుపకరించుచున్నను యూరపు అమెరికా ఖండములలోని తెల్లజాతులు, యేషియా, ఆఫ్రికా ఖండవాసులను, తమ వాణిజ్యముకొరకు లోబరుచు కొనుటలో పోటీలు పడుచున్నంతకాలము యుద్ధములు జరుగక తీరవనియు, యీ పెద్ద రాష్ట్రములవారు తమ సైన్యములను తగ్గించరనియు, వానిని యీసమితి ఆపలేదనియు స్పష్టపడు చున్నది. స్వయంనిర్ణయ సూత్రమును నల్లజాతులవా రందరికిని సమానముగ వర్తింప జేసి, వాని సంపూర్ణస్వాతంత్ర్యములకు యేవిధమైన యాటంకములు కలుగజేయకుండ నుండునపుడే యుద్ధములకు కారణములు కలుగనేరవు. ఈ యంతర్జాతీయసమితిలో స్వార్థపరులైన పెద్దరాష్ట్రములవారికే పలుకుబడి మెండగుట వలన, దీనిని అంతర్జాతీయదొంగలసమితి యని వాడుచున్నారు. జర్మనీ వలసరాజ్యములను, ఆసియాలోని పడమటివైపు రాష్ట్రములను, యీ తెల్లజాతుల క్రిందనుంచి, వీరికి Mandataries అని పేరు పెట్టి, వీని పాలనముమీద పై తణిఖీ తాము చేయునట్లు యీఅంతర్జాతీయసమితివారు యేర్పాటు చేసిరి. ఫిర్యాదీయే న్యాయాధికారి యగున ట్లున్నది. అమెరికా సంయుక్తరాష్ట్రమువారు, జర్మనీ, రష్యా, చైనా, మొదలగు కొన్ని రాష్ట్రములు, యీసమితియందు సంకోచ

మును కలిగియే యున్నారు. మన యిండియా దేశము, తాను, తక్కిన స్వతంత్రరాష్ట్రములతో పాటు, యీ సమితి ఖర్చులకు యెక్కువ ద్రవ్యము నిచ్చుచున్నను, యింగ్లాండుకు యెక్కువ వోట్లు యీసమితిలో నుండవలెనేగాని, యిండియా స్వతంత్రరాజ్యముగ భావించుటకు కాదు. ఈదేశ శాసన నిర్మాణ సభలచేత పంపబడు ప్రతినిధులు యీఅంతర్జాతీయ సమితిలో లేరు. మన విదేశపరిపాలకులు, తమ కనుకూలమైన వారిని అక్కడకు పంపుదురు. మన ప్రతినిధులే యీసమితిలో నున్నయెడల, నానా రాష్ట్రముల వారిచేతను, మన దేశమునకు స్వయంనిర్ణయ సూత్రమును ఆచరణలోనికి పెట్టించగలము. లేదా, యీసమితి నిజముగా దొంగలగుంపని రుజువు చేయించగలము.

---



ప్రథమ ముద్రణము 500 ప్రతులు శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడు గారిచే సరస్వతీ పవర్ ప్రెస్‌నందు ముద్రితము 5985—1931

# వర్ణాశ్రమ ధర్మపరిణామము

ఇది హైందవమతముయొక్క మూలసిద్ధాంతములను, మతకర్తల ప్రమాణవాక్యములను బట్టివిమర్శించుచు అపూర్వ గ్రంథముల మతాచారములయందలి మంచిచెడ్డలను నిష్కర్షగ ప్రజలయెదుట జూపుట కాదర్శము.

వెల 0—12—0.

ధర్మగ్రంథాలయములవారు తపాల ఖర్చులకుగాను 0—4—0 ల తపాలబిళ్లలను పంపినచో రిజస్టర్డు పోస్టులో ఉచితముగా పంపబడును.

నలయువారు :—

వల్లూరి సూర్యనారాయణరావుగారు
B.A., B.L., & L.T.,
కొవ్వూరు
పశ్చిమగోదావరిజిల్లా అని వ్రాయవలయును.

ప్రథమ ముద్రణము 600 ప్రతులు శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడు గారిచే సరస్వతీ పవర్ ప్రెస్‌నందు ముద్రితము 6986—1931